ఓమ్.

# పాతాళద్వీపము

ఇయ్యది

యల్. టి. కృష్ణయ్యశాస్త్రి విరచితము.



చెన్నపురి :
వావిళ్ల ముద్రణాలయమున
ముద్రింపఁబడినది.

 1933 [మూల్యము 0-5-0.

శ్రీః

# స్వాభిప్రాయము.

---

మహోత్తములారా! పాతాళద్వీపమను నీచిట్టిపొత్తమునుగుఱించి పెంచి వ్రాయఁదగినవిషయములు లేవు. పాంచాలదేశమున నీపాతాళద్వీప మనుపేరు గలపురము గలదనియు, నిపుడది చిన్నిగ్రామముగాఁ గాలము ననుసరించి మాఱినదనియు తెలియంగనగు. దానిపూర్వచరిత్ర మే యిది. ఆ దేశమున నేను దిరుగుచుండుతఱి నెన్నియోకథలు విన్నవాఁడను. అవి బాలురకు మిక్కిలి నీతిని గఱపునవిగా నుండునన్నయుద్దేశమున నీచిట్టిపొత్తము వ్రాసితిని. ఇద్దానివెనుకఁ బదునాలుపొత్తముల వ్రాసితిని. మొదట వ్రాసిన దీనిని బ్రకటింపఁ దలంపుగొని యుంటిని. 1932-వ సం॥ మేనెలలోఁ బశ్చిమగోదావరిమండలమునఁ బ్రధాననగరమైన యేలూరునందు బ్రహ్మశ్రీ, జనమంచి శేషాద్రిశర్మ గారిని జూచి సంభాషించుభాగ్యము కల్గెను. వారికీచిట్టిపుస్తకముం జూపితిని. నాయక్షరము లోరుల కభేద్యములు గానఁ జదివితిని. విని బాగున్నదనిరి. ముద్రించి యిప్పించుభారము మీదే యంటిని. వారు వావిళ్లముద్రణాలయమువారి నడిగి వ్రాయుదుమనిరి. తుదకు వ్రాఁతపనియు వారిపై వైచితిని 1933-వ సం॥ జనవరి 2-వ తేది మదరాసులో వారిని గనుటయు వారద్దాని గైకొని ముద్రించి పంపుట కంగీకరించుటయు జరగెను. ఆమాట ప్రకారము వారు ప్రవర్తించి నన్ను ధన్యుంగావించిరి. వారిపనులమాని వ్రాయించి ముద్రించి

నాకు నొసంగినందులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడనై వారి కనేక వందనశతము లర్పించుచున్నాఁడను. ఇందలి నాలోపములఁ మన్నింప గ్రంథకర్తలను విమర్శకులను వేఁడుచున్నాఁడను. చరిత్రాత్మకమగు నీపొత్తము విద్యార్థులకుఁ బాఠ్యముగా నియమింప ననుగ్రహింప విద్యాశాఖాధికారుల వేఁడువాఁడను.

ఇట్లు,
యల్. టి. కృష్ణయ్యశాస్త్రి.
శ్రీ. శ్రీ. శ్రీ.

# పండితాభిప్రాయములు.

• బ్రహ్మశ్రీ, యల్. టి. కృష్ణయ్యశాస్త్రిగారు రచించిన పాతాళద్వీపమును జదివితిని. శైలి మనోహరము; సులభము. కథావిధానము చమత్కృతికి నిల్లు. విషయము విద్యార్థులకు నుపాధ్యాయులకుంగూడ గ్రాహ్యము. కావున నీపొత్తము కదుంగడుఁ జిన్నదియే యైనను నీతిసారమే యగుటం బెద్దదియే యనవలయు. భాష సులలితము. ఇట్టి గ్రంథముల నింకను రచించి గ్రంథకర్త విశాలయశస్సు నార్జించుఁగాతమని కోరుచున్నాఁడను

ఇట్లు,
కావ్యతీర్థ, రావాడ వేంకటరామశాస్త్రి,
ప్రధానాంధ్రపండితుఁడు, మ్యునిసిపల్ హైస్కూలు, కడప

---

బ్రహ్మశ్రీ, వే. యల్. టి. కృష్ణయ్యశాస్త్రిగారు పంపిన వ్రాఁతపుస్తకమును బఠించితిని. పాఠశాలయం దుండఁదగు ప్రవర్తనమే యిందుఁ బ్రధానము. ఏదో యొకకథను మది నునుచుకొని యిది విషయాంతరమున వ్రాసినట్టు కనుపట్టు. మంచివర్తన మెల్లరకు వృద్ధిప్రదమని యిది తెలుపును. పుస్తక మంత పెద్దది గాకయున్నను నీతిసార మనందగియున్నది. గర్వము నాశ్రయింపక యడఁకువగలిగి యుంద ఉండవలయుననియు, నదియే యశస్సు నొసంగుననియు నీపొత్తము బోధించును. సర్వజనాంగీకృతమగు విషయమే యిది. ఇట్టి నీతిబోధకగ్రంథముల నింకను రచించినట్టు గ్రంథకర్తగారే తెలిపియున్నారు. ఇయ్యది యెల్లెడల వ్యాపించుఁగాక.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ, కడప.

శ్రీ ర స్తు.

# పా తా ళ ద్వీ ప ము.



చ. సిరుల నొసంగుఁగాక తమి సేవకరాజికి సంతతంబు దు
స్తరవికలాపదల్ తలఁగి తత్త్వము తానయి వెల్గు నాపరా
త్పరుని నిరంజనుఁ దనయభంగురశక్తిని ద్రిప్పుచుఁ మనో
హారతమదృగ్విలాసయయి యవ్యయతేజయు నౌ పరాంబ
[తాన్.

చ. తనయెడఁ గల్గుదోషములఁ దత్త్వవిదుల్ తెలుపంగ వారి నీ
సున నదలించి కృత్రిమపుఁజొప్పున నే చరియించుచుఁ జగం
బునఁ దనకడ్డు లేదనుచుఁ బోలఁదలంచుచు సంచరించు దు
ర్జనతతి జ్ఞానసంయుతి నెసంగఁగఁ జేయుతఁ జక్రి కూర్మితోన్.

క. చెడుమార్గంబున గర్వం
బడరంగా నడుచు దుర్జనావళి త్వరగాఁ
జెడు నంచు నెఱిఁగి బాలురు
నడువఁ బ్రయత్నింపవలయు నయమార్గమునన్. 3

చ. ఒకయెడ దుర్జనప్రకర ముద్ధతిఁ జేయు ప్రయత్నమెల్ల సుం
త కొఱఁత లేక పండును బుధప్రకరంబు నయంబు మీఱఁ బూ
నిక నొనరించుయత్న మది నిష్ఫలమై చను నట్టులైన నీ
తికలిత మేదొ యద్దియె రీతిం బొగడంబడు మంచివారిచేన్.

క. కావున విద్యార్థులు భువిఁ
బావన మని ఖ్యాతిఁగన్న పథమున నెపుడుం
బోవలయు నంచుఁ జక్కఁగ
భావింపఁగ వలయు దానఁ బరఁగు సుఫలముల్. 5

# కథారంభము.

ఒకానొక కాలమునందుఁ బాతాళద్వీపము ప్రఖ్యాతి నందియుండెను. అది శివనదిదగ్గర నుండెను. ఆయేటివలని యుపయోగములుమాత్ర మాద్వీపమునకు లేవు. ఆద్వీపమునఁ గొంతకాలము దాహోదకము దొరకుట కష్టము. ఇదియే యాయేటివలన నెంతలాభ మాద్వీపమునకుం గలదో తెలుపును. అది యొకపురము. దానికే ద్వీపమని పేరు. ఆపే రెందులకుఁ గల్గెనో చెప్ప వలనుపడదు. నాలుగుప్రక్కల జలములుండ వానినడుమ నున్నభూభాగమునే ద్వీప మని పెద్ద లందురు. పాతాళద్వీపమున కాలక్షణములు లేవు. ద్వీపము నంతరముననే జలసమృద్ధి తక్కువ. మూఁడుదెసలఁ గొండలుండుట యొకభాగమున నించుకదూరమున శివనది యుండుట యను నీకారణములే యది ద్వీపముగాని ద్వీపకల్పముగాని కాదని తెలుపును. మఱెందులకాపేరని ప్రశ్నము చేసిన నాలుగుప్రక్కల నుండు భూభాగ మెత్తుగానుండుట నగరభాగము తగ్గుగానుండుట యనుకారణముల నీపే రెవ్వరో పెట్టిరని సమాధానము చెప్పవలయును. ఇదియుఁ దగినసమాధానము కాదు. ఏపూర్వులో యీపేరుమాత్రము పెట్టిరి. అది ప్రసిద్ధమాయెను.

పాతాళద్వీపమున వసించువారు తఱచుగా నలుపురంగు గలవారు. మోములు వెలవెలవాఱుచుండ వారు రోగులవలెఁ గనఁబడుచుందురు. ఆరోగ్యభాగ్య మరుదుగా వారల కబ్బుచుండును. అదియుఁ గొలఁదిదినములే నిలుచును. ఆద్వీపమున ఋతువు లైదుమాత్రమే వేసమునఁ జెప్పఁబడిన ట్లమరును.

వర్షర్తువు (వానకాలము) సగము గ్రీష్మమునఁ గలియును. శిశిరర్తువు వసంతకాలముతోఁ జెలిమి సలుపును. వసంతగ్రీష్మములు రెండును తమతమగొప్పఁదనమును మానుకొనవు. తక్కినవి తఱచుగాఁ దమసహజవృత్తుల మానుకొనుచుండును. ద్విజులు సంకల్పము చెప్పుకొనునప్పుడుమాత్ర మాఋతువులు స్మరింపఁబడును. తక్కినవారలా పేరులను బుస్తకములయందుఁ బఠింతురు. ఇది యాద్వీపము శీతోష్ణస్థితి. దీనిం బరికించినయెడల నందలివారల యారోగ్యాయుర్దాయముల నిర్ణయింపవచ్చును.

పాతాళద్వీపమున నుండువారు విచిత్రభాష మాటలాడుదురు. లోకమునఁ దఱచుగా దేశముపేర భాషయుండును. ఆద్వీప మేదేశమున నున్నదో యాదేశనామ మాభాషకు లేదు వేఱొకపేర నయ్యది యొప్పు. ఆద్వీపవాసులు పూర్వాచారపరాయణులు గారు. నవీనాచారాసక్తులు గారు. కాలము జరుగుచున్నఁ జాలునని యూహించువారు. దానం జేసియే యుత్సాహములేనివారని యితరు లూహింప నవకాశము గల్గును. కాని వారియం దొక్కయుత్తమగుణము కలదని చెప్పవచ్చును. అన్నదానమున వారి కెక్కుడు ప్రీతి. పరదేశమునుండి యెవ్వరు వచ్చినను వారికి నాజాతివా రన్నము పెట్టుదురు. కావునఁ బ[illegible]నములు క్రొత్తవారు సుఖముగా నందుండ నవకాశము కలదు. ఈయుత్తమగుణమున నందలివారు విఖ్యాతిఁ బొందిరి. విద్వాంసు లాద్వీపమున మిక్కిలి తక్కువయని చెప్పనొప్పును. ఆదరించువారు లేకుండుటయే యందులకుఁ గారణమని కొందఱును, విద్యయందలి ప్రీతియే

వారికిఁ దక్కువయని కొందఱును బలుకుదురు. ఏదియెట్లున్నను విద్య తక్కువయగుటమాత్రము సత్యము. ధనవంతు లందుఁ గలరు. కాని వారుచితకార్యములకు ధనము వ్యయింపరు. ఎన్నియోపనులకు ధనమిత్తురు. విద్యావిషయమునమాత్ర మాసక్తితో ధనము వ్యయింపరు. రాజోద్యోగులు పురి కొల్పుదురేని విధిలేక యొసంగుదురు. అదియు నాకార్యము నకు నెక్కుడుగఁ దోడ్పడంజాలదు. ఇదియే యాద్వీపవాసుల స్వభావము.

ఆకాలపుఁజక్రవర్తి యాద్వీపమున కొక్కయధికార మొసంగెను. అందుఁగల కొందఱుకూడి ప్రజలకందఱకుఁ బ్రతి నిధులై యాద్వీపమును బాలించుచుఁ బ్రభువు నధికారమునకు లోఁబడియుండవలయు ననియే చక్రవర్తి యిచ్చినయాజ్ఞ. ఆయాజ్ఞను మన్నించి యందలివారెల్లరు మహానందమున నా కార్యమునకుఁ బూనిరి. ఉన్నవారిలో విద్యాధికు లెన్నుకొనఁ బడిరి. వారికి మహాసభ్యులనిపేరు. వారిలో నొక్కఁడు వారి యనుమతిని గార్యనిర్వాహకుఁడుగ నుండ మరల వారిచే నెన్నుకొనఁబడియె. మహాసభ్యులు నిర్వాహకుఁడునని ప్రక టింపఁబడియెను. వారికున్నయధికారములన్నియు రాజశాసన మునకు లోఁబడినవియే. కాని నిరంకుశములు కావు. రాజశాసన మునకు విరుద్ధముగాఁ బ్రవర్తింతురేని వారల రాజోద్యోగి వర్యులే తొలఁగింతురు. చక్రవర్తికింగూడఁ దెలుప నక్కఱ లేదు. కావున నీమహాసభ యుచితరీతి మెలంగవలసినదే కాని నిరంకుశాధికారముఁ జూపఁదగినది కాదు. కొంతకాల మారీతిఁ బరిపాలనముసాగెను.

ఒక్కనాఁ డామహాసభ కూడెను. మనద్వీపమున విద్య మిక్కిలి నేర్పఁదగుపద్ధతి నమర్చుట యుక్తము. దానికిం దగిన ధనము వచ్చునుపాయ మాలోచింపవలయు. చిత్రలేఖనాది కళలు నేర్పఁదగును. అందులకును ధన మావశ్యకము. ఈ రెండు కార్యములు మనము సాధించినఁగాని యీద్వీపగౌరవము నిలువదని యొక్కమహాసభ్యుఁ డుపన్యసింప నెల్లరు నామోదించిరి. రాజోద్యోగులకుఁ దెలిపిరి. వారు నందులకు నానందించి రెండుపాఠశాలల నేర్పఱుపఁదగుననియుఁ బ్రభువు ననుమతిని గొంతధన మిత్తుమనియుఁ దెలిపిరి. ఈవార్త ద్వీపమునం దెల్ల యెడల నల్లుకొనియె. ఎల్లరు మహాసభ్యులను బొగడిరి. ఇఁక మనద్వీపము మర్యాదచేఁ బెంపొందఁగలదని నమ్మిరి. కొందఱు సూక్ష్మబుద్ధిగలవారు లేచి నడుముఁగట్టుకొని మన మీవార్తలకు సంతోషింపరాదు. ధనవ్యయము కొంత మనపైఁబడును. అది పన్నులమూలమునఁ బ్రోఁగు చేయఁబూనుదురు అది మహాభారమగును. దానిని భరింపవలసినవారము మనమే యగుదుము. కావున ముందుగ నాలోచించి మనము భరింపఁదగిన దెంతయో తెలిసికొని భరింపఁగలమా యని యాలోచించి పిదప సమ్మతింపవలయును. "తండ్రికి మరలఁ బెండ్లియాయెనని సంతోషము. మాఱుదల్లివలనఁ గలుగనున్నకష్టములను దలంచినఁ బోవు" నన్నట్టు లీప్రమోదము ధనభారవహనకష్టమునఁ జెడఁగలదని ప్రబోధింపసాగిరి. కొంద ఱందుల కంగీకరించిరి. సర్వసమ్మతమైన దన్నభావము కొందఱుకు సమ్మతమయ్యెనని మాతెను.

ఆద్వీపమున నొక్కప్రక్కఁ బెద్దసరస్సు గలదు. అందు జలము తొమ్మిదినెలలే యుండును. ఒకప్పు డెనిమిదినెలలే

యుండును. ఒక్కపార్శ్వమునఁ గుల్యగలదు. అది ప్రవహిం చుట కడునరుదు. విశేషవర్షములు కురిసిన నయ్యది ప్రవ హించును. లేకున్న సైకతప్రవాహామే యందుఁ గనంబడు చుండు. ఒక్కవైపున మరుభూమి కనంబడును. సస్యము లద్దానిం గాంచి భయపడును ఒక్కభాగమునఁ గేదారములు గలవు. సస్యములు పెరుగుకాలమున నయ్యవి చూడందగియుండును. తక్కినకాలమున మరుభూభాగములవలె నవి యుండును. ఆద్వీపమునకుఁజుట్టు నందుఁ దటాకములు కొన్ని కలవు. కాని వానిలో జలములుండుటఁ జూచితి మన్నవారు కొందఱే యుందురు. శీతలద్రుమములు ఫలభూరుహములు నాద్వీపమున లేవనవచ్చును. కాని యేవో చెట్లు లేకపోలేదు. అవియు వేసవికాలములలోఁ బనికివచ్చునవి కావు. పేరునకుమాత్రమే యవి యుండును. కనుకఁ జల్లదనమున కాద్వీపమున నెవ కాశము లేదనవచ్చును. మలయమారుతములు వీవకయున్నను నిదాఘమారుతములు యథేచ్ఛముగా వీచుచుండును. వాని స్పర్శమున నుండు తేజోబలములు క్రమముగాఁ దగ్గుటయేగాని వృద్ధిఁబొందుజాడ కానరాదు. కావున నాద్వీపనివాసము మంచిది కాదను ప్రతీతి వ్యాపించెను.

సమశీతోష్ణములుగలభూభాగములు వాసయోగ్యము లని ప్రాచీనులయభిప్రాయము. అట్టిచోటులనుండువా రరోగులు దృఢగాత్రులు నై యుందురనుట ప్రత్యక్షము. తఱచుగా నందుండువారు మిక్కిలి పొట్టివారుగాక పొడవువారునుగాక యుందురనుట సిద్ధాంతము. పెక్కండ్రు పొట్టివారుగను కొందఱుమాత్రమే పొడవువారుగ నుండుటయు ననారోగ్య

వంతముగ నాభాగముండునని తెలుపుచుండును. ముఖవర్చస్సే యారోగ్యమునకుఁ జిహ్నము. దేహబల మందులకుఁ బ్రోత్సా హకముగ నుండును. అవి రెండు నుండిన నారోగ్య మాచోట విలాసమునఁ జరించుచుండునని మన మూహింపవచ్చును. మన పాతాళద్వీప మట్టియారోగ్యము కలదిగాక వేలువిధముగ నుండును. కావుననే యాద్వీపము సుఖవాసమున కర్హము కాదని పెద్దలందురు. అందుండువారుమాత్ర మాపెద్దల వాక్యములఁ బాటింపక యాద్వీపము సుఖప్రదమే యని వాదిం తురు. అది న్యాయ్యమేకదా. "సుగుణాకర జన్మభూమిసుఖ మెట్టిదో కో" అన్నసూక్తి క్రొత్తది గాదుకదా. ఎల్లతావుల నీసూక్తి కుదాహరణము కలదు. ఎన్నివిధముల నాలోచించి నను పాతాళద్వీపము తక్కినద్వీపములవలె నారోగ్య మొసంగు నదికాదని తేలెడిని.

---

# రెండవభాగము.

ప్రజాప్రతినిధులయ్యు నాద్వీపమునఁ గలమహాసభ్యులు ప్రజలయభిప్రాయములను లెక్కింపక తమప్రయత్నము సాగింపఁ బూనిరి. కొందఱు వారిం గాంచి వలదని వారించిరి. కాని వారు యుక్తియుక్తముగాఁ బనూర్థానమునఁ దెలిపి దేశాభివృద్ధి కిది ప్రధానమనియు నిన్నాళ్లకీయున్న నాగరికత యొప్పదనియు బోధించి ప్రయత్నమును గొనసాగింప మొదలిడిరి. మహాసభఁ గూర్చిరి. ప్రజలెల్లరు సుఖాసనముల నాసీనులైరి. నిర్వాహ కుఁడు లేచి ప్రభువునాజ్ఞయుఁ దమప్రయత్నము వారలకుఁ

దేటపఱచెను. వారియుపన్యాసము చాలమధురోక్తులంగూడి వినయ ముట్టిపడఁగా నెల్లరమానసములను రంజిల్లఁజేసెను. ఎల్లరు ముందున్నయాశయముల మాని నిర్వాహకునియభిప్రాయము నంగీకరింప నెంచిరి. కొంద ఱేవో ప్రశ్నములఁ బ్రయోగించిరి. కాని యవ్వాని కేల యుత్తర మీయవలయు నని కొందఱనిరి. ఆమాటలకు వారు కోపమూనిరి. కలకల మారంభమయ్యెను. ఎవ్వరిమాటయు వినఁబడకయుండెను. ఈకోలాహలము నాపకయున్న యెడల వారియాగ్రహమునకుఁ బాత్రుఁడవగుదునని నిర్వాహకుఁ డూహించి లేచి నిలువంబడి యిట్లు పలికెను.

మహాజనులారా! నావిన్నప మాలకింపుఁడు. దేశవిఖ్యాతి విద్యపై నాధారపడియుండును. మనద్వీపము సకలమండలముల కన్న వెనుకఁబడినదని యెల్లరాక్షేపించుట మీకుఁ దెలిసినదియేకదా. దానిఁ బోఁగొట్టుకొనుట కెల్లరు ప్రయత్నము చేసినఁగాని ఫలింపదు. ఇది పరస్పరద్వేషములకుఁ గాలము కాదు. ఈకార్యముమూలమున మనద్వీపము సమానమండలములయందు మర్యాదఁ గాంచవలయును. ఈప్రయత్నము ధనవ్యయమునకు నాధారమగునేమో యని మీరనుమానింప వలదు. ప్రభుత్వోద్యోగులు వలసినంతధనమిత్తుమని వ్రాసిన పత్త్రము లిందేయున్నవి. మనముకూడ నించుకధనము వెచ్చింప వలసియుండును. అయ్యది సేకరించుధనములోనిదేకాని క్రొత్తగా నందులకై ప్రోగుచేయ నక్కఱలేదు. ఈమాట నిశ్చయము కాని యసత్యముగాదు. రెండుపాఠశాలల నెలకొల్పఁ దొలుత నెంచితిమి. ఇపుడిపుడు మూఁడుగా వాని నిర్మింప నెంచితిమి.

పురుషులకు నొకకటి. స్త్రీల కొకకటి. ఈరెండును విద్యను
జెప్పునవి. ఇంకొకకటి చిత్రకళాశాల. అందుఁ జిత్రలేఖనము,
సంగీతము లోనగుకళలు నేర్పునది. ఈమూఁడుపాఠశాలలు
నిర్మించుటకు వలసినధనమంతయుఁ బ్రభుత్వమువారే యొసంగు
దురు. బోధకులకు వారొసంగునది కాక మనము కొంత వెచ్చింప
వలసియుండును. చతుర్థాంశమో పంచమాంశమో వారొసంగు
వానిలో మనము వ్యయింపఁదగియుండును. ఇంతమాత్రము
సంఘద్రవ్యమును వ్యయించి యెల్లర విద్యావంతులుగాఁ జేయఁ
గూడదా. మీరు నించుక యూహింపుఁడు. అని తెలియఁబలు
కఁగా నుగ్రులైయుండువారుకూడ శాంతముకలిగి కూరుచుం
డిరి. అంతగకలహములమూలమున మంచికార్యము చెడునన్న
భయ మంతయుం గల్గెను. ఒకరితో నొకరు మంచిమాటలాడు
కొనసాగిరి. దానిచే నాకోలాహలము తగ్గెను. వీరికేల యుత్తర
మీయవలయునన్న మాటమాత్రము శూలమువలె మనస్సును
భేదించుచుండెను. వారిమిత్రులామహాసభ్యులలోఁ గొంద
ఱుండిరి. వారునుగూడ నప్పుడేమనకపోయినను మనస్సుల
నించుక యసూయవహించియే యుండిరి. ఎట్టులైననేమి యా
మహాసభ రెండుపక్షములుగాఁ జీలిపోయెను ఆప్రయత్నమున
నెట్లో యెల్లరు సమ్మతించిరి. సభ నాఁటిది విరమింపఁబడియెను.

పుణ్యక్షేత్రములలో శ్రీకాశీనగరము శ్రేష్ఠమని పురాణ
ములు తెలుపును. నిర్మలభాగీరథీతోయములు సేవించువారి
యఘముల నడంచి పరిశుద్ధులను జేయును. శ్రీవిశ్వేశ్వరస్వామి
భక్తుల నుద్ధరించుపొంటె వేంచేసియున్నవాఁడని పురాణము
లితిహాసములు ఘోషించుచున్నవి. భాగీరథీతీర్థమున మునింగి

శ్రీవిశ్వేశ్వరస్వామిని దర్శించి యభిషేకించి కృతార్థుల నొన రింపుమా యని ప్రార్థించి భక్తులు మరలి స్వస్థానముల కరుగు చుందురు. "కాశ్యాంతుమరణాన్ముక్తిః" అను ప్రమాణము నెల్ల వారు స్మరింతురు. మరణకాలమున నావిశ్వేశ్వరస్వామి తారక మంత్రమును గుడిచెవిలో నుపదేశించునని ప్రమాణము కలదు. దాని నెల్లరు విశ్వసింతురు. కావుననే మరణమును గోరి కొందఱు కాశీనగరముననే నివసింతురు. ఎంతవిశ్వాస మానగ రముపయి జనులకుం గలదో యిదియే దృఢపఱచును. ఆకాశీ పురము విద్యాపీఠమని ప్రఖ్యాతిం గాంచెను. ఆనగరమునకుం బోయి యందుంగలవిద్వన్మౌళులకడ విద్య నభ్యసించి వచ్చిన వానినే యేదేశమునఁ గాని పండితుఁడందురు. సకలశాస్త్రములు నందు నివాసము చేయుచు వచ్చి తమ్ము నారాధించువారి నను గ్రహించుననుట నిస్సంశయము. అట్టివిఖ్యాతి నేనగరమైనను గణించినట్లు కానరాదు.

అట్టి పుణ్యవిద్యారాశియగు శ్రీకాశికిం జని చిఱుత ప్రాయముననందే విద్య నభ్యసించి పెద్దల సేవించి సంపూర్ణదీక్షి తుఁడై యిరువదైదవసంవత్సరము నడుచుచునంతయీనాఁడున నొక్క భూసురుఁ డాపాతాళద్వీపమున కరుదెంచెను. కవిత్వము భగవ దనుగ్రహమున నాతనికి లభించెను. ఆయుర్వేదసార మతని కెఱుకపడియెను. సదాచారము పెద్దలయాశీర్వచనమున నలవా టయ్యెను. మార్గశిరమున నాద్వీపమునకు వచ్చి యొక్కనిర తాన్నప్రదాతయింటఁ బ్రోయిలో నెవరోకనంబడి యమ్మని పలుచు కొనిపోయి పదిలంగా నుండెను ఆగృహస్థు వానిని మిక్కిలి యాదరించి యిష్టమృష్టాన్నకలన సంతుష్టునిజేసెను. మఱి రెండు

మూఁడుదినము లాయింటివారు ప్రార్థింప సుండెను. మహాసభ్యు లలో నొక రాగృహమునకు రాఁగా వారితో సంభాషించు భాగ్య మావిప్రకుమారునకుం గల్గెను. పాఠశాల యారంభింపఁ బడుననియు నందుఁ బండితపదమున మీరుండిన బాగుండు ననియు నామహాసభ్యుఁడు తెలిపెను. గృహస్థువుకూడ నందుల కంగీకరింపఁబడయుననియుఁ గొంత కాలము మాయింట నుండఁ దగుననియు వేఁడెను. మఱికొంద ఱందున్నవార లిదె లెస్స యనిరి. ఆయన యంగీకరించెను. నిర్వాహకున కావార్త నా మహాసభ్యుఁడే తెలిపి యధికారపత్రమువచ్చునట్లు లొనరించెను.

కొలఁదిదినములకే మహావైభవమున నాపాఠశాల యారంభింపఁబడియె. రాజప్రతినిధి యామహాకార్యము నారంభించెను. మంగళవాద్యపురస్సరముగా శుభలగ్నమున నావిద్యాశాల యారంభింపఁబడియెను. అందు బాలురుమాత్రమే పఠింప వలయునని నియమము. అనుహావార్తముననే బాలికలకు విద్యగఱపుభవనము నెలకొలుపఁబడియెను. రాజప్రతినిధియే యద్దాని నారంభించెను. ఈ రెండుమహాకార్యములు సంగనకాలమున నెనిమిదవతొమ్మిదవగడియలలో జరుపఁబడియెను. సాయంకాలమున నాలుగడియలప్రొద్దు కలిగియుండుతఱి నొక్కశుభ లగ్నమునఁ జిత్రకళాశాలయు నెలకొలుపఁబడియెను. రాజప్రతి నిధిపత్ని దాని నారంభించెను. వారియుపన్యాసము లతిమనోజ్ఞములుగ నుండెను. ద్వీపవాసు లంద ఱచ్చోటనుండిరి. మంగళ వాద్యములు కరతాళధ్వనులు జయజయనినాదములు చెల రేఁగెను. నాఁటియానంద మాద్వీపవాసులు మున్నెన్నఁడు ననుభవింపలేదఁట.

ఆశుభదినముననే పాఠములు నేర్ప నారంభించి "శుభమస్తు. అవిఘ్నమస్తు" అని కాశీవాసి పలికి నీతిపద్య మొకటి చదివెను.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబు ఘటించుచుం బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
తమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాస్వార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యెవ్వరికిన్.

పద్యమునఁగలభావము దాని సారము బాలురకుఁ దెలుపఁగాఁ బెద్దలెల్ల నాలకించి కరము హర్షించిరి కొందఱు పండితులారా! రెండవపద్య మేదైన బోధింపుఁడని కోరిరి. అట్లే యని యాతఁడు

ఉ. ఓర్వక దుర్జనుండు కఠినోక్తులు సజ్జనుఁ బల్కినేని దు
ర్గర్వుఁడుగాక యాతఁడు వికారము నొందఁ డొకింతయేని తా
నార్వశిఖం గలంగని మహాబ్ధిజలంబు తృణాగ్నివైచినన్
దుర్వహదుఃఖభారమయి తోడనె తాపముపొందనేర్చునే.

దానితాత్పర్యమును బాలురకుం దెలుపుచుండఁగా సభ్యులనుభవించినయానంద మింతయని వచింపఁ దరముగాదు. దేశభాష తొలుత ప్రారంభింపఁదగునని నిర్వాహకుఁ డాజ్ఞాపింపఁగా నట్లే ప్రారంభింపఁబడియె. వెంటనే తక్కుంగలపాఠములు మొదలిడి యుపాధ్యాయులు తెలిపి నాఁటికి సెలవిచ్చిరి. బాలు రానందమున నెలవులకుంబోయిరి.

నిర్వాహకుఁడు బాలురెల్ల నిండ్లకుంబోవ నెంచుతఱి లేచి సభ్యులెల్లరు విన నిట్లు పలికెను. ఈయున్నతపాఠశాలకుఁ

ప్రధానోపాధ్యాయుఁడు పురుషోత్తమరాయఁడు. సహోపాధ్యాయుఁడు జగన్నాథస్వామి. పిదప లెక్కపెట్టఁదగినవాఁడు విజయరామస్వామి. మూఁడవవాఁడు డోడ్యాణపురరాజస్వామి. నాల్గవవాఁడు గోపాలకృష్ణమూర్తి. అయిదవవాఁడు పద్మనాభమూర్తి. ఆఱవవాఁడు వేంకటేశ్వరశాస్త్రి. ఏడవవాఁడు శ్రీశదాసు ఎనిమిదవవాఁడు సుబ్రహ్మణ్యరాయఁడు. తొమ్మిదవవాఁడు భుజంగరాయఁడు. పదియవవాఁడు కేశవవర్మ. పదునొకండవవాఁడు జయరాఘవగుప్త. పండ్రెండవవాఁడు నరసింహామూర్తి. పదుమూఁడవవాఁడు శ్రీనికేతనాచార్యుఁడు. పదునాల్గవవాఁడు లక్ష్మీవర్ధనవర్మ. పదునైదవవాఁడు గురునాథదాసుఁడు. పదునాఱవవాఁడు సాధుపాకాచార్యుఁడు. పదునేడవవాఁడు కృష్ణదాసగ్రంధి. పదునెనిమిదవవాఁడు ప్రచండవర్మ. పందొమ్మిదవవాఁడు ధేనుకాచార్యుఁడు. ఇరువదియవవాఁడు సర్వభక్షద్వివేది. ఇరువదియొకండవవాఁడు మధుసూదనపాత్రో. వీరుపాధ్యాయు లనఁబడుదురని సంకేతము. అనంతగిరిశాస్త్రి. కుమారశర్మ, మధురేశ్వరగోస్వామి యను వీరు విద్వాంసు లనఁబడుదురని సంకేతము. సౌమిత్రిమిత్ర, సుదర్శనదాసులను వీరు శిల్పులు. వీరెల్ల నిందు బాలురకు విద్యఁ గఱపుదురు. అనధ్యాయము లనఁబడు పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య అనువానియందుఁ బాఠశాల మూయఁబడును. శ్రీరామనవమి లోనగు దేవతాపూజాదినములయందును సంవత్సరాది లోనగు పండుగులయందు నట్లె యది మూయఁబడును. అతివృష్టి లోనగు భయంకరదినములయందు నట్లె యని యెఱుంగవలయును. రాజాగమనము లోనగు సంతోషదినములయందు నిందు

వేడుకలు సాగును. ఇవి యిప్పటికిఁ దోఁచి చేసినకట్టుబాటులు. అని తెలుప నెల్లరుఁ జాలబాగున్నవని సంతోషించిరి.

బాలికాపాఠశాలకు నిట్లే యుపాధ్యాయినీసంఘము నియమింపఁబడియెనని వారిపేరులు నందుఁ జదువఁబడియె చిత్రకళాశాలయందు నట్లే యుపాధ్యాయులపేరులు తెలుపఁబడియెను. సాయంకాలముకాఁగా నెల్లరు తమతమవిడుదుల కరిగిరి. ద్వీపమునఁగల స్త్రీబాలవృద్ధులు పాఠశాలలయందలి నియమములకు మిగుల నానందించుచుఁ దొలుతఁ దమరూహించినది వ్యర్థమనియు నీనియమాలమున నీద్వీపమునకువిఖ్యాతిగల్గుననియు నిందలివారు విద్యాధికులై పరదేశములయందుఁగూడ విఖ్యాతి గడింతురనియుఁ జెప్పుకొనసాగిరి. మఱునాఁటనే ధనవంతులని పేరుగాంచిన సుబ్రహ్మణ్యగుప్త పదివేలరూప్యములు వితరణముగఁ బంపి దీనివృద్ధిని పేదబాలురకు నీయవలయునని నిర్వాహకుని బ్రార్థించెను. ఆమఱుదినమే పుణ్యాత్ములగు సున్నగుప్త ముప్పదాఱువేలరజతముద్రికలను వితరణముగాఁ బంపి దాని వృద్ధిని పేదబాలకులకు బుస్తకములకు నిప్పింపుఁడని నిర్వాహకుని బ్రార్థించెను. మఱికొందఱు పంపలుగా నిచ్చిరి. ఒక్క మహాశయుఁడు తనపేరు తెలుపక యిరువదైదువేలరూప్యములను బంపి మీపాఠశాలలోఁ బుస్తకభాండాగారము నిర్మింపుఁడని వేఁడెను. నిర్వాహకమహాశయుఁ డట్లే వినియోగింప నేర్పఱిచెను. ఎంతోసంతసమున నుపాధ్యాయులు బాలకులు విద్యాశాలకు వెడలుచు సాయంకాల మరుదెంచుచు నుండఁగా నా ద్వీపవాసులు కన్నులపండువుగాఁ జూచుచుఁ దమబాలకులు వ్యర్థముగఁ గాలము పుచ్చుచుండఁగా వారిని గసరుచుండు

కష్టము తప్పెననియు విద్యావ్యాసంగమునఁ గాలము పుచ్చు
చుండుట శ్రేయస్సనియుఁ దలంచుచుండిరి. పాఠశాలలయం
దెల్లరకు విశ్వాసము కల్గెను.

---

## మూఁడవభాగము

పాతాళద్వీపమునఁ బ్రాఁతయాచారముల నుల్లంఘించు
వారిసంఖ్య యత్యల్పము. నూతనాచారముల నవలంబించువారి
సంఖ్యయు నంతమాత్రమే. ఏదో యొక యలవాటు గలిగి దానిని
విమర్శింపక యెట్లో కాలముగడపువారే పెక్కండ్రనుట యథా
ర్థము. వారుకూడ నిలుకడగలవారు కారు. క్రొత్తవారు వచ్చి
కొన్నిమాటలు తెలిపి యీయలవాటు లిట్లుండవలయునన్న
నవ్వానిని నాక్షేపింపక యట్లగాఁబోలునని యంగీకరించువారే
యని యంగీకరింపవలయును. కాని యాయంగీకారముకూడఁ
జిరకాలము నిలువదు. ప్రతిక్షణము వారిచిత్తవృత్తులు మారు
చుండును. ఏవిషయమునందును నిలుకడ లేనివారనియే సారము.
ఆద్వీపమహాత్త్వమేమో కాని యందలివా రితరమండలముల
నుంబోయి విఖ్యాతిసంగడింప నెంచరు. కాని యెంతవారు వచ్చినను
జప్పరింతురు. ఇదియే యందలివారియందుఁ గలవిశేషము.
వాయువుమహాత్త్వమో ఎండశక్తియో యెఱుంగఁజాలము
కాని యందుండువారలమోములు మంచికళ యుండదు. ఆరో
గ్యము తక్కువయని వారిమోములే తెలుపుచుండును. మనో
మాలిన్యము వారికిఁ దక్కువయే. మనోనైర్మల్యము తక్కు
వయే. భగవంతుఁ డనుగ్రహించినబుద్ధిని వృద్ధినొందించి వికసింపఁ
జేయునూహగలవా రందలివారు కారనియే యుండలిసారము.

ఒక్కతఱి నెందుండియో యుట్టిపడినట్టు లొక్కయాచార్యుఁ డచ్చటి కేతెంచెను. ఎన్ని తావులనో మెప్పుగాంచిన మేటియని యాతనికడనుండు యోగ్యతాపత్రములే తెలుపుచుండెను. ఎల్లతావులఁ దిరిగి యెల్లరయుల్లముల రంజిల్లఁజేయు నుల్లాసము గలవాఁడని యాతనిమాటలే సాక్ష్యమిచ్చుచుండును. గొప్ప గృహస్థునింట విడిది చేసి పెద్దమనుష్యులనెల్ల దర్శించి తన యాగమనకారణము నెఱిఁగించెను. యోగ్యతాపత్రములం గాంచినంతనే వారెల్ల దిగ్భ్రమము చెంది యుల్లే యని యంగీకరించిరి. మఱుదినమే వా రుపన్యసింతురని ప్రకటింపఁబడియెను. ఆద్వీపమునడుమ నొక్కభవనము కలదు. సభ సాగింప నదియే తగినది. నడుమనుండుటయు నెందలకొలఁదిగఁ గూరుచుండుటకుఁ దగినయాసనము లమర్పఁబడియుండుటయు మంచిగాలి వచ్చుగవాక్షము లమరియుండుటయు నాభవనము సభానుకూలమగుటకుఁ గారణములు.

ఆభవననిర్మాణము పాఠకమహాశయులు వినఁదగినది. ఆ ద్వీపమున నొక్కగృహస్థువు గలఁడు. ఉపాధ్యాయవృత్తి జీవించువాఁడు. కడుబీదవాఁడు. ఏ దేశముననో తానుజూడని యొకమహానుభావునిపై నతనికి భక్తిగలదు. వారిపేరు వినియు వారిప్రవర్తనము బుస్తకరూపమునఁ బ్రకటింపఁబడుటం జేసి దానిం జదివియు నామహాయోగి యందు బద్ధాదరుఁడయ్యెను. వారిని దర్శించివత్త మనుకొన్న ధనములేదు. విమానాదిసాధనములు లేవు. శకటప్రయాణమునకు వందరూప్యములు కావలయును. అంతశక్తి చాలదు. కావున వారిఛాయాపటమును దిలకించి భక్తిగలవాఁ డయ్యెను. నిత్య మావ్యక్తిని మది నిలిపి

పూజించువాఁడు. ధ్యానించుచుండువాఁడు. కావున వారిపేర నొకభవనము నిర్మించి యందొక్కపుస్తకభాండాగారము నెలకొలిపి తన్మూలమున నామహాత్ముని నామ మాద్వీపమున శాశ్వతముగా వెలయఁజేయు కోరికకలవాఁడయ్యెను. దారిద్ర్యమాతనియూహాలనెల్ల నొక్కత్తుగఁ గృశింపఁజేయుచుండెను. కాని యాతఁడు తనపూనిక వదలక యెట్లో యొకశుభదినమున నొకప్రాఁతయింట నామహానుభావునిపేరఁ బుస్తకభాండాగారము నెలకొల్పెను. తనకడనున్న నాలుగైదుపుస్తకములే నాఁటి కాపేటికలలో విశ్రమింపఁజాలెను. నలుగురుపెద్దలం బిలుపనంపి చందనతాంబూలములు యథాశక్తి నర్పించి సభ సాగినదని పించెను. తనమిత్రముల నడిగి కొన్నిపాత్రముల సేకరించి యద్దాని నించుక పెద్దదిగాఁ జేసెను కొంతకాలముదనుక నట్లే సాగించుచుండెను. ఏఁటేట సభ చేయించుచు నామహానుభావుని నామము నలువురకుఁ దెలుపుచుండెను. నలువురు నానాఁడు మాత్ర మాతనిప్రయత్నముం గొనియాడుచు మఱునాఁటికే యాతఁడెవ్వరో మఱచిపోవుచుండిరి.

ఒక్కవత్సరము యథాపూర్వముగనే సంవత్సరోత్సవము సాగెను. ఆనాఁడు విదేశములనుండి వచ్చినవారు సభలోనుండిరి. వ్యాపారార్థము వచ్చినవారే వారని యెఱుంగవలయును. ఉపన్యాసముల నాలకించి యా దేశభాషయందు మిక్కిలి పాండిత్యములేకున్న నించుక ప్రవేశముకలవారుగావున దానిసారమును గ్రహించి యామహాయోగియం దాదరముగలవారుగాన నాభవనమునందుఁగల ప్రాఁతపాత్రములను విలకించి సభాధిపతి యనుమతింగొని యీభాషాజ్ఞానము లేకున్నందున మాటల

ధోరణి నైరింపుఁడని ప్రార్థించి యాభవనమునకు వలయుధన మొసంగుదుమనియుఁ గ్రొత్తభవనము నిర్మింపవలయుననియుఁ బుస్తకభాండాగారమునకుఁ గొంతధనమిత్తుమనియుఁ దెలిపిరి. ఎల్లరు మహానందమునం దేలిరి. కొందఱుమాత్ర మాకీర్తి వారి కేలపోవలయునన్నయీసున మనవారుగానివా రిచ్చినధనము గ్రహింపరాదనియు నది దుర్ధనమనియు మనకపయశ మద్దాని చేఁ గలుగుననియు మనమే ధనము ప్రోవుచేయఁదగుదుమనియు ఘోషించిరి. కాని పెద్దలుకొందఱు లేచి యిన్నియేండ్లనుండి యించుకంతయుఁ దోడ్పడని మన మిపు డేరీతి సాయపడు దుమో తెలియఁజాలమనియు నిది మంచియాలోచనము కాద నియుఁ బలికి యామహాశయుల యౌదార్యముం గొనియాడి వారిభావము నంగీకరించితమని తెలిపిరి కార్యనిర్వాహకవర్గ మేర్పడి పని సాగింపఁబూనెను.

స్థలనిర్ణయ మెట్టకేలకు నిశ్చయింపఁబడియెను. ఎల్లర కనుకూలముగా నుండఁదగునన్నయూహ చేసి యిపుడున్న చోట నాభవనమును గట్టనారంభించిరి. తమపేరు బయలుపఱుపవలదని యాపుణ్యాత్ము లిరువదిసహస్రములరూప్యము లొసంగిరి. భవన మేరీతిగా నుండవలయునన్నయూహ వ్యాపింపఁగా నొక్క మహారాష్ట్ర దేశీయుఁడు దాని నేర్పఱచెను. భవనము పూర్తి కావచ్చెను. పదిదినములలోఁ బూర్తియగుననఁగాఁ బూర్వము ధనము వారివలన గ్రహింపరాదన్నమునలాగ్రబుద్ధులే యత్యుచ్ఛ ముగా సందందుఁ గూనలమ్మనుగీత మనునట్లు మాటలాడుచు నీభవనము మనజాతిగౌరవము నడంచునని యాక్రోశించుచు నల్లరిచేయసాగిరి. పెద్దలెల్లరు నాలుగు చమత్కారగుడు లర్పించి

వారిన్నోరుమూయించిరి. భవనము పూర్ణమయ్యెను గృహప్రవేశోత్సవము సంతోషముగలిగించుచు సాగెను. అప్పటికిఁ బుస్తకభాండాగారము పేటికాదశకపరిమితముగా నుండెను ఎన్నియో భాషలపొత్తము లందుఁగలవు. వరుసఁగా బృహత్పేటికలు కన్నులపండువు చేయుచుండెను. రజతభవన మను పేరు పెట్టఁబడియెను. ఎట్టిసభసాగించిన నెల్లరుఁ గూరుచుండఁదగు నాసనము లందుఁ గలవు. కావుననే యాద్వీపమున నేవిషయమునుగుఱించి కాని సభ సాగించినయెడల నందే జరుపఁబడును. కొంతకాలమున కందుఁగలసభ్యులలోఁ గొంద ఱాభవనమును గట్టించినవారు రాకుండఁ దగినట్లు పనిసాగించిరి. వారక్కఱకానిండని వెడలిపోయిరి.

ఆనాఁడు మొదలాభవనకార్యనిర్వాహకవర్గమున నంతర్గకలహముల కారంభమయ్యెను ఒక్కరుచెప్పిన దింకొక్కరు గాదనుటయే వారిపాండిత్యము. కార్యము సాగవలయునన్నచింతయే వారికి లేదు. ఓర్వలేనితనము వారిముఖములపైఁ గాలూని నాట్యము చేయుచుండెను. వ్యక్తిదూషణములనజకిద్దానివేఁడిమి వ్యాపించెను. ఆద్వీపవాసులలోఁ గొంద ఱిరుదెగలవారలపక్షముగా నుండక తప్పకపోయెను. మఱింత యుద్రేకమున కది హేతువయ్యెను. ఆకారణమున నామహాకార్యము చక్కఁగా సాగక యెట్లో సాగుచుండెను లోకమున బహువిధచరిత్రములు గలవారు గలరు. కొందఱు తమరే యన్నికార్యముల సాధింపవలయు ననునూహగలవారు. మఱికొందఱు తమ రూరకయుండి యశస్సు రావలయునని కోరువారు. మఱియుఁ గొంద ఱితరు లేసత్కార్యములు చేయుచున్న నోర్వలేనివారు.

ఇంకఁ గొంద ఱితరులు కష్టములపాలు కాఁగాఁ జూచి యానం దించువారు. ఇట్టు లనేకభంగుల వారి ప్రవర్తనము లుండును. పాతాళద్వీపవాసులలోఁ దఱచుగాఁ దొలుతటి మూఁడుపద్ధతులుగలవారలే. కొందఱు మంచిపద్ధతులఁ బ్రవర్తించువారు గలరు. కాని వారి కానగరమునఁ బ్రఖ్యాతి తక్కినవారికున్న యట్లులేదు. ఆమహాభవనమునకు శంకరదాసభవనమని పేరు పెట్టఁబడినది. దాని కార్యముల నిర్వహించుసంఘమునఁ గల తొమ్మండుగురిలో మూవురు కలహప్రియులు. ఈర్ష్యాళువులు. కావునఁ దక్కినవా రెక్కువసంఖ్యగలవారలయ్యు సజ్జను లగుట వీరిని సమానులనుగా భావించుచుండుటం జేసి వీరి దుర్వృత్తి వ్యాపింప నవకాశము కల్గెను. ఈవిషయము నిటు లుంచి పూర్వకథాశిష్టభాగమును బఠింతము.

శంకరదాసభవనమున రే పుపన్యాసమని ప్రకటింపఁ బడియెఁగదా. కరపత్రములు మిగులఁ జమత్కృతజనకములుగా నుండెను. వానిం జదివినవా రెల్ల నిఁక నుపన్యాస మేలాగుం డునో యని యువ్విళ్లూరుచుండిరి. మఱునాఁడు సాయంకాల మునకుముందే సభ యారంభమయ్యెను. శ్రోతలు క్రిక్కిరిసి యుండిరి. ఉపన్యాసకుఁ డెంతో హొయలుమీఱ నరుదెంచెను. సభాధిపతి వేంచేసెను కరతాళధ్వనులు చెలరేఁగెను. కొంత వడి కయ్యవి శాంతిల్లెను. సభాధిపతి తొలిపలుకులు దైవప్రార్థన పూర్వకముగాఁ జెల్లెను. వేదికపైకి నుపన్యాసకుఁ డెక్కెను. కరతాళములు చప్పుడులు చెలఁగి శాంతల్లెను పంతు లుపన్యాస మున కారంభించెను. చేతులు ముకుళించి

శ్లో. రామమిందీవరశ్యామం రాజీవాయతలోచనం,
జ్యాఘోషనిర్జితారాతిం జానకీరమణం భజే.

అని యపస్వరముగలకంఠమునుండి వెడలించెను. మహాత్ములారా యని యారంభించి పూర్వాచారములం గడుంగడుం దెగడి శ్రోత్రియాచారముల వేయిభంగులం బొగడి మహర్షులం దిట్టి కాచపాత్రస్థతీర్థపానాసక్తుల నెంతయో పైభాగమునం బెట్టి తోఁచినరీతులం బలికిపలికి తుదకుఁ బూర్వపుసదాచారములు దురాచారములనియుఁ దీర్థయాత్ర దండుగనియుఁ దిక్తకషాయ (కాఫీ) పానము దుష్టకృమిధ్వంసకమనియు నీదివ్యామృతపానమునఁ గలమేలు తెలిసియున్నచోఁ బూర్వులు సోమపానాసక్తి మానియే యుందురనియు గొంతకాలము సేవించి చూచినఁ దెలియంగలదు కాని యూరక యది తెలియఁదరము గాదనియు నిట్లే యెన్నియో విషయములు సిద్ధాంతము చేసితిననియు నుపన్యసించి కూరుచుండెను.

సభాధిపతి లేచి యుపన్యాసకులగుణగణములను వర్ణించి వారిభావముల నుగ్గడించి కొందఱ కయ్యవి యనుకూలములు గావనియుఁ గొందఱకు మఱికొన్ని యనుకూలములు గావనియు నందఱ కనుకూలము లగువిషయము లొక్కరీతిగా నుండవనియు నొక్కి వక్కాణించి యేదియుఁ దాను సిద్ధాంతము చేయకయుండ గోడమీఁదిదీపమువలె ద్వంద్వార్థములుగా మాటలాడి కూరుచుండెను. తాంబూలాదిప్రదానముల నాసభ ముగిసెను. కూరుచున్నవారిలోఁ గొందఱుసమయమనియు నాలోచింపక మాటలాడఁబూనిరి. ఇపు డద్దానికి సమయము కాదని కొందఱనిరి. మీ కడ్డుమాటలు పలుకునధికారము లేదని కొందఱనిరి. ఈమూఁడుతెగలవారలుపాధ్యాయులే. సభ్యులలోఁ గొందఱు గంభీరభాషణముల వారల నదలించిరి.

వారవ్వానిని లెక్కసేయక యథాపూర్వముగా నడ్డుప్రశ్నములు వేయఁజొచ్చిరి. కోలాహలముగా సభాభవన మొప్పెను. అంత సభాధిపతి లేచి యితరులకు బుద్ధిచెప్పఁ బూనియున్న యుపాధ్యాయులే యిట్లు ప్రశ్నించిన నేమనవచ్చును. మీకు లోకజ్ఞానము శూన్యమని సువ్యక్తమయ్యెను. ప్రశ్నోత్తరముల కిది చోటుగాదు. బాలురతో భాషించుట మీయలవాటు. దానినే యిందుఁ జూపుచున్నారు. ఇది మీకు మర్యాద కాదు. మూర్ఖులగు బాలురకు మర్యాద నేర్పుట యిట్టులేనా. ఇంకనైన దయయుంచి యీ ప్రయత్నమును మానుఁడని హెచ్చరించెను. పౌరముఖ్యులు కొంద ఱట్లే నుడివిరి. అయ్యది వారలయుద్రేకము నడఁపఁజాలకపోయెను. కాని యంతలో నొక్క కొందఱు పౌరులు ప్రయత్నించి యర్ధచంద్రప్రయోగములచే వారి నవ్వలికి మెల్లఁగా ననిపిరి.

మఱుపిన యుపాధ్యాయులయం దొక్క కొందఱు పరాభవసంతప్యమానహృదయులై యొక్కచోఁ జేరి యాలోచించి యీసభ్యుల నేమియుఁ జేయఁజాలమికిఁ జింతిల్లిరి. ఎట్టులైన నెల్లయెడల నాద్వీపమునందుఁ దమసేరల్లుకొనఁ జేయవలయునని నిశ్చయించిరి. అందును గొంద ఱాయుపన్యాసకు నభిప్రాయములను మెచ్చుకొనిరి. కొంద ఱవ్వాని నీసడించిరి. కొందఱుభయమాధ్యస్థ్యమును వహించిరి. ఎట్టులైననేమి యాయుపన్యాసకునిభావ మింపుగనో గొప్పగనో యందఱ బాధింపకపోలేదు. ద్వీపమం దంతట గలపిలపాటు గలుగకయుండలేదు. విశేషించి క్రొత్తయాచారములను మెచ్చుకొనువారు స్త్రీలలోఁ బెక్కండ్రుండిరి. అవి యనర్థదాయకములని పెక్కండ్రు

పూరుషు లూహించిరి. కాని ప్రాయముగలవార లవ్వానిరుచి చూడఁగోరిరి. ముదుసలులలోఁ గొంద అవ్వాని నాచరించి యందలి చెడుగుల ననుభవించిన మార్పుఁదగునని బుద్ధికలుగక మానదు, మన మేల తొందఱపడవలెను. ఊరకుండిన నన్నియుఁ దమయంతనే చక్కఁబడునని యూహించి నిశ్చింతముగనుండిరి. చిఱుతప్రాయమువారిలోఁ గొంద ఱాయాపీఠులలో సనాతనాచారపిశాచములఁ బాఱఁద్రోలి నవీనశుభాచారముల నెలకొల్పఁదగునని ప్రబోధించుచుఁ బ్రచారము చేయఁబూనిరి. వారి కోలాహలము మెండయ్యెను. ద్వీపమం తెల్లకాఁపుల నీప్రస్తావమే వినఁబడసాగెను.

స్త్రీవిద్య ప్రధానమనియు దాని నవీనపద్ధతి ననుసరించియే నేర్పవలయుననియుఁ బ్రాచీనపద్ధతి నయ్యది నేర్పఁబడినచో నాగరకత దానఁ జేకూరదనియు నెల్లెడఁ దొలుదొలుత నీవిషయమై కొంచ్చరికగలిగి ప్రవర్తింపవలయుననియుఁ బ్రబోధింపఁ గొందఱు పూనిరి ప్రతిదిన మీయుపన్యాసములే సాగుచుండుటం జేసి యెచ్చోట నుపన్యాసకుఁడే యుండునట్లేర్పడెను. ఉపన్యాసకులు తమయింటఁగలబాలికల కట్టివిద్య నేర్పఁబూనక యుండనేల యని ప్రశ్నించువారు పొడకట్టసాగిరి వీరిమాట యింట సాగదని కొందఱు ఉత్తరము చెప్పసాగిరి. కొలఁదినెలల కాయుపన్యాసముల నాలకించువారు రపృశ్యాకారులగు దేవతలే కాని మానవులు లేకపోయిరి అది వారి కాగ్రహమును గలిగించెను. కాని యట్టివేలలుగాని వా రుపన్యసించుచునే యుండిరి. క్రమముగా వారి కన్నము పెట్టువారె కనఁబడకపోయిరి విని విని విసిగితిమని కొందఱు వారు వినుచుండఁగనే తమలోఁ

దమరు చెప్పుకొనసాగిరి. అంత వారెంతయు లజ్జించి యిఁక మనజతనము సాగదని కాలికి బుద్ధిచెప్పిరి.

ఏకాలమునఁగాని కుమార్గము పెంపొందఁజాలదు. తొలుదొలుత నభివృద్ధినొందుజాడలు కనంబడును. కాని తుదకు నశించును. ప్రజల కవ్వానివలన నెన్నియోకష్టములు కలుగును. దాన వారు విసిగి యేల యీయలజడులని వానిని వదలుదురు. ప్రాఁతయాచారము లలజడులఁ గల్గింపవు. నీతికి విరుద్ధములుగా నుండవు. ఆరోగ్యమునకు భంగమును గల్గింపవు. ధనమును బాడుచేయఁ బ్రయత్నింపవు. మర్యాదకు నాధారములుగా నుండును. కీర్తిని గల్గించును. భగవంతుని దయకుఁ బాత్రులనుగాఁ దమ్మాశ్రయించువారిని జేయును. కావుననే యవి చిరకాలము నిలిచియుండఁజాలునని యంగీకరింపఁబడినవి. ఈసిద్ధాంతమునకుఁ బైయుపన్యాసకుల ప్రవర్తనమే యుదాహరణము. లోకమున నెవ్వాఁడు కాని తనకుఁ దోఁచినదానినే లోకులెల్ల ననుసరింపవలయునని యాలోచింపరాదు. సర్వసమ్మతముగునభిప్రాయము తనకుఁ దోఁచునని గర్వమును బొందరాదు. భగవంతుఁడు మంచియూహలను గొందఱకుఁ దోఁచునట్లు చేయును. వానినే యనుసరించువారు కొందఱే యుండునట్లు చేయును. కావున నీసిద్ధాంతము నెఱింగిన ప్రాజ్ఞులు తమభావముల నొరులకుఁ దెలుపుదురే కాని వాని వారనుసరింపకయున్న విచారపడరు. అల్పమతు లట్లుగాక విరుద్ధముగఁ బ్రవర్తింతురు. దాన వారే చెడుదురుగాని యితరులకు బాధ గలుగనేరదు.

# నాల్గవభాగము

చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూఁతిపిందెలు పుట్టు నన్నట్లు లోకమున నొకసంఘమో నగరమో దేశమో క్షీణించు కాలమునకు నందుఁ బూర్వముగలజనుల మంచియాశయము లన్నియు మాఱి దాని కనుగుణములగు నాశయములు వెలయు చుండును. అట్లే వృద్ధినొందఁగలకాలమునకు నందుఁగలదుష్టా శయములు మాఱి సదాశయములు పొడసూపును. ఇద్ది మార్పునొందనిసిద్ధాంతము. అన్నిలోకముల నీసిద్ధాంతము ప్రవర్తించును. జనులు మంచియాచారముల నలవఱచుకొని దేశమునం దభిమానము కలిగి తమలోఁ దమను కలహింపక యైకమత్యప్రధానులై పరదేశవాసులకుఁ దమరహస్యములఁ దెలియనీయక ప్రవర్తింతురేని అట్టిసంఘము నగరము దేశము వృద్ధినొందునని మన మెఱుంగవచ్చును. అట్లు గానిచో నవి క్షీణించునని యును మనము తలంపవచ్చును.

పాతాళద్వీప నివాసన్యాసకులచేఁ దాఱుమాఱుగాఁ జేయఁబడినది మొదలు లంకలివారెల్లఁ బరస్పరద్వేషము పూను వారైరి. ఒక్కరిమాట యింకొక్కరికి రుచింపదయ్యెను. విద్యా విధానముననే గాక యాచారములయందు నీద్వేషము వృద్ధి యైనకతన భేదము పొడసూపసాగెను. ఆకస్మికముగా నీ మార్పుగలిగినదే ఏల యని పెద్దలు కొంద ఱూహింపసాగిరి. తుదకుఁ గాలగతి యిద్దానికిం గారణమనుసిద్ధాంతమే తోఁచెను. మాఱుచేయ యోజించిరి కాని యది యశక్యమనియు దైవమున కెదురుతిరుగువారు సుంఘరు యనియు నూహించి యూర కుండిరి. పెద్దలెల్ల నిరుత్సాహులు కాఁగాఁ జక్కనవారెల్లరుఁ

జెలరేఁగి ప్రాఁతయాచారముల మీఁఱి తోఁచినయట్లే వర్తింపఁ సాగిరి. విద్యావిధానమునందు గడియకొక్కమార్పు చేయఁబడుచుండెను. ఆమార్పుకూడ నొక్కరీతినుండక వేలువేలు పద్ధతులుగ నుండెను. విద్యార్థులకు వచింపరాని యలజడి కలుగుచుండెను. ఉపాధ్యాయులకుంగూడఁ దలనొప్పికల్గింపక యావిధానము వదలలేదు. స్త్రీవిద్య యనుమాటయే యెల్లతావుల మ్రోఁగుచుండెను. ప్రతిదిన మొకొక్కసభ చేయఁబడుచుండెను. తోఁచినట్లు మార్చుచుండిరి. ఒక్కపద్ధతి ననుసరించి చదువుచెప్పుచుండ నింకొక్కపద్ధతి మంచిదనునియమము పత్రికాముఖాలనున నధికారులందించుచుండిరి. దానిం గాంచి యుపాధ్యాయులు విసుగునొంది యారెండుపద్ధతులం గలిపి తమకుఁ దోఁచినట్లే బోధించుచుండిరి. పాఠ్యగ్రంథములు ప్రతిదినము మారుచుండెను. కొలఁదినెలలకే యాపద్ధతులు ముప్పుదెచ్చిపెట్టుచున్న వనుసూహ యెల్లరకుఁ దోఁచెను.

విద్యావిధానమునందువలెఁ దక్కినయాచారములయందును మార్పు కలిగింపఁదగునని కొందఱు వ్రాసిరి. వివాహమైదుదినముల సాగుట ప్రాఁతయాచారముగ నుండెను. దానినొక్కదినముకాని మూఁడుదినములుగాని సాగింప మార్పవలయునని కొందఱు పట్టుపలలఁ జూపసాగిరి. వారిమార్గము బాగున్నదని కొందఱు అంగీకరించిరి. అట్లు సాగించుచుండిరి. కాని పూర్వమునకంటె వ్యయ మధికమగుటయేగాక విందులచేర దినసంఖ్యకూడ హెచ్చుచుండెను. అతిథిపూజ వ్యర్థమనియు, దానిచేఁ బెక్కండ్రు సోమరిపోతు లగుచున్నవా రనియు దేశము బీదస్థితియందున్నదనియు నాదురాచారపిశాచమును

బొఱఁదోలినఁగాని దేశము బాగుపడదనియుఁ గొందఱుపన్య సించుచు నుండిరి. ఆవిషయము చాలభాగుగను సత్యముగ నున్నదని యొక్కకొంద ఱంగీకరించిరి. వివాహాదిశుభకార్య ములయందును బితృకార్యములయందునుంబిలువనివారెవ్వరును రాఁగూడదనియు, వచ్చినచో నర్ధచంద్రప్రహారప్రయోగముచే వెడలఁగొట్టఁబడుదురనియుఁ బెద్దయక్షరములఁ గూర్చినవస్త్రము గృహాంగణములఁ గట్టఁబడుచుండెను. వివాహాదులయందుఁ బిలువకపోయినను రాఁదగునని, యన్నదానము యథాశక్తి న్యాయముననుసరించి చేయుట మంచిదని పెద్దలేర్పఱచిరని కొందఱు తెలుపుచుండిరిగాని యావాదముల నాలకింపనివారే పెక్కండ్రుగఁ జూపట్టుచుండిరి. ఈవ్యయము తగ్గినదని సంతో షింప నవకాశము లేక విందులు నుపహారములు విరివిగ సాగుటం జేసి వ్యయమే మిక్కిలి యగుచుండెను. దానికి లోలోనఁ బరితపించుచుండియుఁ బనుము గ్యాదనుభంగమగునని యానూత్న నాచారప్రియులు నోరుమూసికొని యూరకయుండిరి.

దేవాలయములవలన నేలాభములు లేవనియు వాని యందు సాగించునుత్సవములయందు ధనము వ్యయమగు ననియు, నయ్యది నిరుపయోగకరమనియు, నట్టివ్యయముల మాన్పి పామరులకు బుద్ధిచెప్పవలయుననియు నొకవాదము బయలువెడలెను. అద్దాని నలువురకుఁ దెలుపఁబూని కొందఱు పన్యాసకులు చెలరేఁగిరి పల్లియలకుంబోయి యుపన్యసించుచుఁ బామరులం బిలిచిపిలిచి బోధింపసాగిరి. కొలఁదిదినముల కీయుప న్యాసకులు మత్తుపదార్థముల నుపయోగించు టెట్టెంగి యుపన్య సించునపుడే నలుగురు వినుచుండఁగాఁ బామరులే మీరీదారా

చారముల మానరాదాయని చీవాట్లుపెట్టసాగిరి. ఆయాచార ముపన్యసింపక వేఱొక్కయూరికిం బోవుచుండ నందలివారు కూడ వారి కుత్సితాచారములను రోసి వెడలఁగొట్టసాగిరి. పెక్కుతావుల నీరీతిగా మర్యాదజరగుచుండఁగా నిఁక నాటలు సాగవని యావృత్తిమాని యిండ్లకు వారు చేరుచుండిరి.

లోకమున నెవ్వారుగాని యితరులకుఁ జెప్పుచుండు సదాచారములను దమరాచరింపవలయును. వానిని శ్రద్ధతో నాచరించుచుండిననే యితరులు వారిమాటల నమ్ముదురు. తమ రన్యథా ప్రవర్తించుచు నితరులకు వేఱువిధముగ బోధించిన యెడల వారు వారిమాటల నమ్మక వారిని వంచకులనుగా భావింతురు. తమకు న్యాయ్యమని తోఁచిన ధర్మము నాచరించుచు నితరులకు బోధింపవలయును. దానికి భగవంతుఁడును బ్రీతుఁడగును అట్టినీతుల నెల్లరుఁగాకయున్నఁ గొందఱైన నావహింతురు అందుఁ గొంద ఱవ్వాని నాచరణమునఁ బెట్టుదురు. అది కొన్నిదినములకు వృద్ధియగును. ధనార్జనమునకో కీర్తి నార్జించుటకో వేషమువేసి తమకు సమ్మతములుగాని ధర్మముల నాచరించినట్లు నటించుచు నితరులకు బోధించుచు నుండిన యెడల వారు కొంతకాలము మర్యాదఁగాంచినను దుదకు నిందలపాలగుదురు. అంతియగాక తమజీవితమును బాడుచేసి కొనువారు నగుదురు. చెడుపనులన్నింటిలోఁ దమరాచరింపని ధర్ములఁ దమకార్యముకొఱకు నితరులకుఁ దెలుపు టతినీచ కార్యము. బుద్ధిమంతు లట్టిపని నేనాఁటికిఁ జేయరు.

తీర్థయాత్రలకుఁ బోవువారలకు నన్నముపెట్టఁదగు నను నాశయమునఁ గొందఱు సత్రములఁగట్టించి యన్నముపెట్టుచుం

డిరి. అట్టి కార్యము మంచిది కాదనియు నావ్యయము దుర్వ్యయమే యగుననియు నట్టిదుర్వ్యయముల నొనరింపకయుండ బోధించి యన్నములేక కష్టపడుచుండువారల కన్నదానము చేసి ధనమిచ్చిన మేలనియు నాయది దేశాభివృద్ధికి హేతువగు ననియు నొకవాదము బయలువెడలెను. దాని నెల్లరకు బోధింపఁ గొందఱు ప్రయాణముసాగించిరి. ప్రతిపల్లెకుంబోయి యందఱను బిలిచి పిలిచి యుపన్యసింపఁబూనిరి. ఈపనియందుపాధ్యాయులే కడుంగడు శ్రద్ధవహించిరి. ఒక్కపల్లియలో ముప్పురుపాధ్యాయ లొకసంఘముగాఁ బోయియుండి యందొక రుపన్యసించిరి. పెక్కండ్రు నాల్గుప్రక్కలంగల పల్లియలవారు వచ్చి వినుచుండిరి. ఉపన్యాసము కాఁగా నొక్కఁడు ముసలి లేచి మహానుభావా! తమ రీకార్యమొనరించుట శ్లాఘ్యము. మీవృత్తినిగూడ మానివచ్చితిరి. అందులకే పదివేలవందనము లర్పింపవచ్చును. ధనవంతులుసు కాఁబోలు. ఎన్ని దినములు తిరిగి నను సంసారమున లోటురాదుకదా యని ప్రశ్నించెను. ఆతఁ డాతనియాకరమున కెంతయునుప్పొంగి రోగులుగానుండు నుపాధ్యాయులకుఁ గొంతకాలము విషమగ యొసంగఁబడు నని యధికారు లుత్తరువును బాలించిరి. ఈకార్యమునఁగల ప్రీతిచే మేము మూపురము రోగమనువ్యాజమున వారి సెలవు మతినొంది వచ్చితిమి. మూఁడునెలలు గడచినవి. ఇఁక మూఁడు నెలలు గడువున మిగిలియున్నవి. వేతనము సమగ్రముగానిత్తురు. కావున జీవయాత్రకు భంగములేదు. మాయీప్రయత్నము మీవంటి యుదారహృదయులసాహాయ్యమునఁ గొనసాగవలయునని దైవముం బ్రార్థించువారమని బదులిచ్చెను. ఆముదు

నలి యిట్లు పలికెను. అపూర్వసత్యప్రియులారా! తమరేకదా బాలురకు నీతి నుపదేశించువారు. సత్ప్రవర్తనము నేర్పుటకే కాదా తమరు నియోగింపఁబడితిరి. ఆవృత్తియందే కొన్ని యేండ్లు గడపితిరి. అట్టి మీరు సంపూర్ణారోగ్యవంతులైయుండియు రోగవ్యాజమున నాలునెలలు సంపూర్ణవేతనముం బుచ్చుకొనుచు విడుమరఁ గైకొంటిరి. ఇట్టి మీ ప్రవర్తనమే యసత్ప్రవర్తనమునకు నుదాహరణముగా నుండఁగా మీ బోధములకు లోఁబడినవా రెట్టియోగ్యులుగ నుందురో బ్రహ్మయేని వచింప శక్తుఁడు కాఁడు. ఇఁక మాబోంట్లమాట యిటనేటికి? ఇట్టి మీరు వంచకు లనఁదగుదురు. ఇఁకనైన నోరు మూసికొని కదలిపొండు. తెలియనిధర్మముల నుపదేశింపకుఁడు. ఏమో బుద్ధిమంతుల మనుకొంటిమి. మీకంటె దుర్మతు లుండఁబోరు. మరల మాటాడకుఁడు. అనఁగా నెల్లరు కరతాళధ్వనులతోఁ దమయాశయము లాముదుసలి చెప్పినదానినే నమ్ముచున్నవారమని గట్టిగాఁ బలికిరి. తమయవివేకమునకుఁ జింతించుచుఁ దముదారిన నాయుపాధ్యాయు లేగిరి.

వారియనుచరులుకొందఱు తద్విషయమునే యందందుఁ దెలుపసాగిరి.ఒక్కచో నొక్కనూత్నవయస్కుఁడు లేచి యిట్లు పలికెను. ఆర్యా! మీకు లోకజ్ఞానము తక్కువయని తోఁచెడు. తీర్థయాత్రలకరుగుట మహోత్తమకార్యమని భరతఖండవాసులయాశయము.మార్గాయాసమునకోర్చి భగవంతుని సేవించు నాశయమునఁ బోవుచుండువారు సన్మార్గనిరతు లనకతప్పదు కదా. అట్టివారి నన్నదానమున సత్కరించు టుత్తమకార్యమా యని ప్రశ్నించుటే తెలివితక్కువ కుదాహరణము. అందులకగు

ధనవ్యయము మంచిఫలమునే యొసంగును. కాని దుష్ఫలము నొసంగదు. అన్నములేక శ్రమింపఁడువారి కన్నముపెట్టుట మంచిదే యనవలయును. తఱచుగ నట్టివారు సోమరులుగనుందురు. పాటుపడువారికి నన్నము కలుగకపోదు. కూలిచేయువారు దొరకినదానిలో సగము సురాపానమునకు వ్యయమొనర్తురు. అన్నమైన లేకుందురుగాని కల్లు త్రాగక యుండఁజాలరు. అట్టివారి కన్నముపెట్టుట ధనమొసంగుట దుర్వ్యయమే కాక మఱేమగును? యాత్ర చేయువారిలో నట్టివారుండరా యని యడుగువారుందురు. ప్రాయికముగా నంతదుర్వృత్తు లుండరనవచ్చును. యాత్రకొఱకు ననఁగా నేదో యొకించుకభక్తిగల వారే తీర్థములను బుణ్యస్థలములను సేవింప నరుగుదురని తేలెఁడిని. ఒకానొకరుండిన నుండవచ్చును. స్థాలీపులాకన్యాయము ననుసరించియేకదా పరీక్షింపుపద్ధతి లోకమున సాగుచుండును. కావున యాత్ర చేయువారల కుపకారము చేయునిమిత్తము వెచ్చించుధనము దుర్వ్యయమునఁ జేర్పఁబడునని భావింపరాదని గట్టిగాఁ బలికెను. ఆపిన్నవానిమాటల నాలకించి యందఱొక్కపెట్టున "బాగుబాగు" అని పలికిరి ఉపన్యాసకులు బదులుపలుక వలనుపడమిఁ దమయిండ్లకుంబోయి మరల నా ప్రయత్నము చేయరైరి.

పాతాళద్వీపవాసులలో నొక్కకొందఱు లోకసంఘముగాఁ జేరి యాలోచించి తమయాశయముల నెల్లరకుఁ దెలిపి మెప్పు పొందఁగోరిరి. నాటకములఁ జూడఁబోరాదు. నాటకములు నీతిబాహ్యములు. స్వభావవిరుద్ధముగా నవి రచింపఁబడును. కావున వాని నభ్యసించువారు క్షుద్రబుద్ధులు. వారి కేమాత్రము

తోడ్పడరాదు. ఇతరుల కీవిషయములను బోధించి నాటకకళ నభ్యసించినవారలకుఁ దోడ్పడునట్టి దురాచారమును రూపుమాపవలయును. అను మొదలగు విషయములఁ దమయనుచరులకు బోధించి కొంతధనము సేకరించి వారలకు నందుఁ గొంత యొసంగి పంపిరి. వారును బోయి పల్లెలలోను బత్తనములలోను బోధింపసాగిరి. క్రొత్తపల్లి యనుగ్రామమునం దుపన్యసించుచుండఁగా నొక్కబాలుఁడు లేచి యిట్లు పలికెను.

మహానుభావులారా! నాదొక్కమనవి. దాని నాలకించి దోషములున్న మన్నింపుఁడు. కాళిదాసాదిమహాకవులు నాటకములు వ్రాసిరి. మహానుభావులందఱు వాని నాదరించిరి. వానిం దిలకించిరి. అందలినీతులఁ బరిగ్రహించిరి. పామరులకు నీతి నేర్పుటకు నాటకములకంటె నెక్కుడు పనికివచ్చునవిలేవని నాయాశయము. అవి పూర్వకాలమునందున్న మహనీయులచరిత్రమును దెల్పుచు నప్పటిసదాచారములఁ గనఁబఱుచుచు రాజప్రజలసంబంధమును దేటపఱచుచు వానివలనఁ గలుగులాభములను సిద్ధాంతము చేయుచునుండును. ఆనాటకములను జూచినంతనే పామరులు తమరు నట్లు మంచినడవడుల నలవాటుచేసికొనుట మంచిదని తలంతురు. పూర్వులవలె నటించుపాత్రల ప్రవర్తనమే నాటక మనంబడెనని నేనర్థము చేసికొంటిని. నాయెఱింగినంత దనుక నాటకములు లోకమునకుఁ గీడు కల్పించుననుట పొరపాటని యేర్పడినది. అట్టివానిని బహిష్కరింపవలయునని మీరుపన్యసించుట యేమికారణముననో యూహింపఁజాలక యున్నాఁడను. నాటకములాడువారలలోఁ గొందఱు దుష్ప్రవర్తకు లుండవచ్చును. వారి నుదాహరణముగాఁ గైకొని

నాటకములే దుర్నీతిబోధకము లనఁదగునా? అది న్యాయ్య మగునా? పదుగురు పెద్దలు మెత్తురా? ఏల యీలీల లేనిపోని మనశ్చింతలు కల్గింతురు? ఈకృషి భగవంతునియెడల నొనరించిన నెంతయో మేలుండునుగదా యని గట్టిగాఁ బలికి యూరక యుండెను.

ఆబాలుని మృదుమధురవాక్కులు వినువారిహృదయములనెల్ల నాకర్షింపఁజాలెను. ఎల్లరు చిత్రప్రతిమలరీతి నుండిరి. సభాధిపతి తొలుత నెన్నికొనఁబడినను ప్రధానస్థానమునఁ గూరుచుండక యామాన్యుఁడు నలువురు గూరుచున్నచోటనే కూరుచుండి వినుచుండెను. ఆసమయమున నాతఁడు లేచి యెల్లరు విన నిట్లుపల్కెను. మహానుభావులారా! ఉపన్యాసము వింటిరి. పిదప నొక్కబాలునివాక్కుల నాలకించితిరి. మీాయందఱు యభిప్రాయమును గనుఁగొనునంత యవకాశ మీాయని సంతోషమునఁ బలుకఁబూనిన యీనాచాపలమును సహింపుఁడు. బాలుఁడుగాఁదోఁచు నీబుద్ధిమంతుఁడు జ్ఞానవృద్ధుఁడే యనవలయును. ఆచిరంజీవి నాపంటివానికంటె బుద్ధిమంతుఁడు. లోకజ్ఞానమున నతఁడే మనలోఁ బెక్కండ్రకంటె మేటి. అతని ప్రతివాక్కు నీతిసారభూయిష్ఠ మనవలయును. కాళిదాసాది మహాకవులు పెక్కండ్రు లోకజ్ఞానసంపన్నులు పామరులకు నీతి బోధించుపొంటె ననేకనాటకముల రచించిరి పండితులెల్ల వానిని శిరస్సులఁ దాల్చుచు గౌరవించుచున్నారు.

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః".

అన్న కాళిదాసునికన్న మిన్నయని నీతిశాస్త్రమున నెన్నఁదగువాఁడు లోకమున నున్న యనవలయును. నీతిబాహ్యములే

యైనచో వారేల వానిని వ్రాయుదురు? పెద్దలేల హర్షించి పఠన పాఠనముల వాని వెల్లడింతురు. కావున నట్టివి నీతిబాహ్యము లనుట న్యాయ్యము కాదు. అనుమాట లామహాసీయునినోటి నుండి వెలువడినంతనే యెల్లరు మహోల్లాసమున నౌనౌనని దిక్కులు పిక్కటిల్ల ధ్వనిచేసిరి. అయ్యది సభ్యులయాశయ ముల వెల్లడించినందున నాయుపన్యాసకులు సుంతయుఁ బలుకక యందుఁ దమబాణముపాఱదని మఱుదినమే వేఱొకచోటికిం గూడఁ బోవక తమనివాసములకే పోయిరి. ఇట్టు లాపాతాళద్వీప వాసుల నూతనాభిప్రాయములయం దొక్కఁడే లోకమునకు నచ్చకపోయెను.



## అయిదవభాగము.

ఉన్నతపాఠశాల దినదిన ప్రవర్ధమానముగఁ గొన్నియేండ్లు సాగెను. అందలియుపాధ్యాయు లొక్క దేశమునుండి వచ్చిన వారు కారు. పెక్కుదేశములనుండి వచ్చినవారు. సోదరులవలె వారంద ఱుండిరి. పరీక్షలయందు త్తీర్ణులగుబాలురు పలుతావుల నాపాఠశాలవృత్తాంతమును బొగడుచుండిరి. వారిమూలమున దానివిఖ్యాతి నలుగడల వ్యాపించుచుండెను. సహోపా ధ్యాయుఁ డగు జగన్నాథస్వామి స్వదేశమునకరిగి యందే యుండఁగోరెను. ఆయనస్థానమున నీలాద్రిరాజస్వామి నియ మింపఁబడియెను. ఏడవయుపాధ్యాయుఁడు పరలోకమున విద్యాపద్ధతిఁ బరిశీలించి రాఁగోరి పోయెను. వారిస్థానమున లక్ష్మీనివాసదాసు నియమింపఁబడియె. పదునాల్గవయుపాధ్యా

యుఁడు దేశాంతరమున కరిగెను. వారిస్థానమున దేశవర్ధన పాత్రో నియమింపఁబడియెను. విదేశములనుండియే వీరు వచ్చిరి. తొలుదొలుత నీయున్నతపాఠశాలయం దభిమానము చూపఁ బూనినట్లే వీ రగపడుట నెల్లరు సంతోషించిరి. కొలఁదిదిన ములు పాఠశాల చక్కఁగనే సాగెను.

పురుషోత్తమరాయఁడు విద్యానిధి. బాలురకు బోధించు నాతనిశక్తి యనుపమానము. మోమోటమి యతనికి మెండు. ఎల్లర సమ్మానించుచుండుటయే యతనిస్వభావము. కరుణ యత నికి నుగ్గుతోఁబెట్టినట్లు పుట్టుకనుండి వచ్చినది. ముఖము భయం కరముగ నుండును. మానసము శాంతమునకు నాలవాలము. బాలురనెల్లరఁ దనపిల్లలవలెఁ జూచుకొనువాఁడు. అట్టిమహా నీయుఁడు ప్రధానోపాధ్యాయుఁడుగనుండ నిఁక నాపాఠశా లకుఁ గొఱంతయేమి? ఎట్టయెదుటనున్న బాలికాపాఠశాలయం దలి యుపాధ్యాయీసంఘము విఖ్యాతిఁగాంచఁజాలినది. రెండు పాఠశాలలు పంతమువేసికొని వృద్ధికి వచ్చునట్లుండెను అన్యో న్యానురాగము గలిగి రెండును రెండుకన్నులవలె నొప్పుచుం డెను. ద్వీపవాసులెల్లరు పరమానందము ననుభవించుచుండిరి. సహాయోపాధ్యాయుఁడగు వేంకటేశ్వరస్వామి విద్యాధికుఁడు కాఁడు. బోధించుశక్తి యించుకగానున్న నద్దానింగూడఁ బక్ష పాతమూని యుపయోగించువాఁడు. అట్టులగుట నాతనియందు బాలురలోఁ బెక్కండ్రకు విరక్తి కలుగుచుండెను. లక్ష్మీనివాస దాసు కృత్రిముఁడు. ఉపాధ్యాయులను వేఱుచేసి కలహ ములు కల్పించుటయే యాతనికింగల యుత్తమగుణములలోఁ బ్రధానము. ఆతనికుతంత్రములకు లోఁబడి భుజంగరాయకేశవ

వర్మ శ్రీనికేతనాచార్యప్రభృతు లొకపక్షముగా నుండ నిశ్చ యించిరి. సాధుపాకాచార్యుఁడు గోడమీఁదిపిల్లివలె నుండెను. దేశవర్ధనపాత్రో యుదాసీనుఁడుగానుండి కొంతకాలమున కా సంఘముననే కలిసెను. సర్వభక్షకద్వివేది యెల్లరయుల్లముల కనుగుణముగా మాటలాడుచుఁ బరస్పరకలహములఁ బెంపొం దించుచు సర్వవస్తుసంగ్రహణకౌశలము వెలయనుండెను. మధు రేశ్వరగోస్వామి విద్వాంసుఁడయ్యుఁ బురోభాగిపదము నొంది ప్రల్లదములాడుచు నా కుపక్షముననే చేరెను. తక్కినవా రేపక్షమునకుఁ జేరక న్యాయమార్గమునఁ బ్రవర్తించువారైరి.

పురుషోత్తమరాయఁడు తననీతికౌశలమున నెల్లర కను గుణముగఁ బ్రవర్తించుచు మనశ్చింతగలవాఁడే యయ్యెను. వేంకటేశ్వరస్వామి లోనగువారు వ్యర్థముగఁ గాలముం బుచ్చుచుఁ బ్రధానోపాధ్యాయుని యానతి నీసడించుచు యిష్టానుసారము మెలఁగసాగిరి. అదియే పురుషోత్తమరాయని మనోదుఃఖమునకుఁ బ్రధానకారణమని తక్కుంగలయుపాధ్యా యులు తలంచిరి. కాని దాని మాన్పఁజాలక యూరకుండిరి. భుజంగరాయప్రభృతులకుఁ బురపాలకమహాసభ్యులలోఁ గొం దఱు మిత్రులగుటంజేసి ప్రధానోపాధ్యాయు నానతి తృణ ముగా భావించుచు బాలురకు బోధింపమాని స్వేచ్ఛగా నుండ సాగిరి. ప్రధానుఁ డావిషయము నిర్వాహకునకుఁ దెలిపియు నద్దాన లాభముఁ గానక చేయునదిలేక తనపనిఁ జక్కఁగాఁ దాఁజేయుచుండెను. న్యాయపక్షమువారు వారికిఁ దోడ్పడుచు వారిశాసనములను శిరంబుల ధరించుచు బాలురకుఁ జక్కఁగా బోధించుచుండిరి. దేశమున నెల్లశాఖల నావిద్యామందిర

దుస్థిస్థితి వ్యాపించుచునే యుండెను. ఆద్వీపవాసులు మనష్యుల నొచ్చుకొనుచు మోమోటమిగలవారలగుట నాయుపాధ్యాయుల నేమియు ననఁజాలక మనకేల యీ ప్రసంగమని యూరకుండిరి. ఆసంఘమునకు ధార్తరాష్ట్రసంఘమని నామకరణము పెద్దలచేఁ జేయఁబడియెను. పాండుతనయ సంఘముకలదుగాని యది యీధార్తరాష్ట్రసంఘముతోఁ బ్రతిఘటింప సాహసింపక పోయెను. "లోకాపవాదాద్భయ" మ్మను భర్తృహారిసూక్తి ధార్తరాష్ట్రసంఘమునకు సరిపడకపోయెను. నిర్వాహకుఁడు మహాసభ్యులును విద్యామందిరదుస్థితిని దలంపక స్వలాభమునకే పాటుపడుచుండిరి. కొంతకాల మీలాగు సాగెను.

ఆద్వీపమున నాకాలముననే మతద్వేష మంకురించెను. జాత్యభిమానము హెచ్చెను. సర్వమానవసోదరత్వము తుద ముట్టి నశించెను. మతాభిమానమునను యుండవలసిన నయ్యాన్యాది యాద్వీపవాసులయందు వికృతించబొరసెను. దాన నంతః కలహములు పొడసూపెను. అవి క్రమముగాఁ బెరుగసాగెను. జాత్యభిమానము వానికిఁ దోడ్పడెను కావున ననేకసంఘములుగా నాద్వీపవాసులసంఖ్య యుండఁజాలెను. ఒక్కసంఘము మే లింకొక్కసంఘ మోర్వఁజాల కుండెను. తుదకు నొకసంఘమున్నంతనే మండిపడునంతస్థితి యన్నిసంఘములకుం గల్గెను. ఆద్వీపభాష విచిత్రముగా నుండునని ముందే పాఠకమహాశయులు చదివియుందురు. అన్యభాషల మాటలాడువారు పెక్కం డాద్వీపమున నెలకొనిరి. విద్యాధికు లాద్వీపమున లేకుండుటయే యందఱు క్రొత్తవా రందుఁజేరి పలుకుబడికలవారగుటకుం గారణమని యందఱకుం దోఁచును. క్రొత్తవారే

యెల్ల భంగులఁ జేరెన్ని కఁగాంచఁగల్గిరి. అందలివారు కూపకూర్మ మర్యాద కుదాహరణభూతులగుట నితరులనాశ్రయించి వారినే పొగడుచుఁ దమవారిఁ దెగడుచుండిరి. దీనింబట్టి పరికింపఁగా నాద్వీపవాసుల మనోవృత్తి ధైర్యస్థైర్యము లెట్టివో తేటపడఁ గలవు. అన్యభాషలు మాటలాడువారు తమ్మెంత దూషించిన నాలకించు చుండవలసినదుగఖస్థితి వారలకుం జేకూరెను. ఈవిధ మెఱింగిన యన్య దేశములవారు మఱింత చెలరేఁగి యందలివారి నతినీచులఁగాఁ జూడసాగిరి. పేరుప్రతిష్ఠయుఁ గలవారుగా నుండవలయునని ,యొకరిద్దఱు ప్రయత్నించినను గృతార్థులు కాఁజాలకుండిరి. తమవారే తమ్మాదరింపనియపుడు వారేమి చేయఁగల్గుదురు?

పాఠకులారా! ఏ దేశముగాని సజ్జనసమాక్రాంతమగు నేని వృద్ధిపొందును. జనులెల్ల దేశభక్తి రాజభక్తి దేవతాభక్తి కల వారలగుచు స్వదేశభాషాభిమానము గలవారలగుదురేని యా దేశము విఖ్యాతింగాంచును. ఇందేది కొఱఁతఁగాంచినను విఖ్యాతిం బోఁగొట్టుకొనును. మానవు లలసులు కారాదు. కార్యముల పట్ల నిరుత్సాహులు కారాదు. విద్యావిషయమునఁ దృప్తిగల వారు కారాదు. పరోపకారమున వెనుదీయువారు గారాదు. పరులబాధించువిషయమునఁ నుత్సాహముకలవారు గారాదు. ఏకాలమున నట్టివారు పెక్కండ్రుందురో ఆదేశ మాకాల మున వృద్ధినొందఁజాలునని సిద్ధాంతము చేయవచ్చును. రాజెంత వాఁడు? అనునూహ కలుగరాదు. పెద్దలకు లోఁబడనేలయను నూహలు కలుగరాదు. దైవభక్తివలన నేమిలాభమని తర్కింప రాదు. శాస్త్రములు నిరర్థకములని తూలనాడరాదు. కులమర్యా

దలను సదాచారములను దూషింపరాదు. స్త్రీలకుఁ గలమంచి యలవాటుల సడలింపఁ బూనరాదు. వారి సభలంజేర్పఁ బ్రయత్నింపరాదు. వారి నెందుఁగాని నిందింపరాదు. స్త్రీలకు విద్య యెందులకని యాక్షేపింపరాదు. వారుచేయు వ్రతములు నిష్ఫలములని పలికి వారికింగలదేవతాభక్తిని దాఱుమాఱుచేయ రాదు. ప్రాతస్స్నానము చేయుటవలన ఫల మేమని ప్రశ్నింప రాదు. వివాహాదులయందుఁ బలువురకు నన్న మేల పెట్టవలయు నని భాషింపరాదు శక్తికిమించిన దానము చేయువారిని గని వినయమున నిది మంచిదిగాదని తెలుపక మనకేల యని యూరక యుండరాదు. కలిగినంతభాగ్యమున బీదల కన్న దానముచేయక లోభత్వము పూనరాదు. ఇట్టి ప్రవర్తనముగలవారు పెక్కుండ్రుందురేని యాకాలమున నాదేశము విఖ్యాతిం గాంచు ననుట నిర్వివాదము. పై లక్షణములులేనివారే పెక్కుండ్రుందురేని యాదేశవిఖ్యాతి యడుగంటుననుటయు నుత్తమసిద్ధాంతమే.

పాతాళద్వీప మీరీతిఁ గుమతులచే సంకీర్ణము కాఁగాఁ బరదేశవాసులు చెలరేఁగి స్వకార్యార్థమనేకభేదోపాయములం బన్ని వారిని బలుభంగులఁ గలంపసాగిరి. దాన మఱింత ద్వేషము సంఘములకెల్లఁ గలిగెను. అయ్యది వ్యక్తిదూషణమునందుఁ బరిణమించెను. దాన నెవ్వరికిని శాంతమనునది గలుగదయ్యెను. శమము నశింప దమ మేలాగు (మనోనిగ్రహము) తలసూపఁ గలదు? అవి రెండును బొడవడంగినమర్యాద నిలువఁ జోటెందుఁ గనఁబడును? అది లేకయున్న లోకప్రవృత్తి చక్కఁగా నెట్లు సాగును? అపుడపు డాద్వీపమున దొరతనమువారి రక్షకభటులు

జనులకలహముల నాపవలసినదుస్థ్సితి యేర్పడెను. పరస్పరద్వేష మాద్వీపమున నెల్లదిశలఁ దాండవమాడసాగెను.

ఒక్కనాఁ డొక్కవీథియందు మతధర్మసిద్ధాంతముల నొకకొందఱు సభగాఁ గూడి తర్కింప నారంభించిరి. పెక్కండ్రితరమతములవారు నందుఁగలరు. స్వమతధర్మము లుత్తములని చెప్పుకొనుట ప్రాయికముగా నుండునాచారమే కాని పరమతధర్మములు నీచములనకుండుట సజ్జనులయలవాటు. పరమతధర్మములు తుచ్ఛములనుట దుర్జనులయలవాటు. అదియే యాసభలో నాఁడు సాగఁజొచ్చెను. అందుండువారలు పెక్కండ్రు పరమతములవా రానీచోక్తులకుం గినిసి కలహింపసాగిరి. వాక్కలహముగఁ దొలుత నారంభించి యది ముష్టియుద్ధములోనికి దిగి దేహశుద్ధికి హేతువయ్యెను. వీథలోఁ బోవువారిలోఁ గొందఱందుం బ్రవేశించి చకారగుడులు సమర్పించి మాన్పి తమదారిన వెళ్లిరి. ఆనాఁడు మొదలాద్వీపమున మతమూలముగాఁ గలహములే చెలరేఁగసాగెను. ముఖ్యముగా శైవులు వైష్ణవులే యాకలహములకుఁ బూనినవారిలో నగ్రగణ్యులు. వారియందభిమానముగల యితరమతములవారుగూడఁ బాల్గొనసాగిరి. కొలఁదిదినములలో నాపాతాళద్వీపము దుస్థ్సితిపాలయ్యెను. పెద్దమనుష్యులమాట సాగకపోయెను. అల్పబుద్ధులే చెలరేఁగి యన్నిఁటికి మేమే పెద్దలమని ఘోషింపసాగిరి. అనేకపక్షములు కలహించుచుంటె నేర్పడియెను.

పుణ్యమందిర మొక్కండందుఁగలదని పాఠకమహాశయులీవఱకే చదివియున్నవారు. అందుఁ జొచ్చినవారు శాంతచిత్తులై పరమతాచారసహిష్ణువులై యుండవలయును. ఏకలహములకు

నందుఁ జోటులేదు. శాంతమునకే యందుఁగల స్థల మవకాశ మిచ్చును. అట్టితావుననే కలహము లీయల్పబుద్ధులమూలమున నారంభమయ్యెను. ఎవ్వరైన నాపక్షములలో నొక్కదాని యందుఁ జేరక తప్పదయ్యెను. అక్కారణమున నన్యోన్య ద్వేషమే యందుఁ దాండవమాడ నారంభించెను. లక్ష్మీనివాసదాసు భుజంగరాయఁడు లోనగువారే యాపుణ్యమందిరమునఁగల్గు కలహములకుం బ్రధానులని పాఠకులు గ్రహింపవలయును. కొలఁదినెల లిట్లు సాగఁగా నాద్వీపము తుచ్ఛజనాక్రాంత మయ్యెను. భుజంగరాయఁడు లోనగువారు మర్యాదయన్న నెట్టిదని ప్రశ్నించునంతధీరులు తమపనికై యెట్టివారికడకైనఁ బోయి పాదములపైఁబడి వారిఁ బ్రార్థింపఁగలరు. కార్యాంతమున నాశని దూషింపఁగలరు. అట్టిమహాకౌశల మామహాత్ములకుం గలదు. వారలే యాద్వీపమున కలంకారభూతులు.

కొంతకాలమునకు జ్ఞానవృద్ధులు కన్నుతెఱచి చూచి యిదేమి విపరీతముగా నున్నది. కాలగతిప్రభావమా: విఖ్యాతి వడసిన యీమహాద్వీప మిట్టియపఖ్యాతికి లోనయ్యెను. చేయఁదగున దేమియులేదా? ఇట్లె యూరకయుండిన నామమాత్రావశిష్టమై యీద్వీపము పాడవడంగదా మనము చూచుచుండఁదగునా? ఏలాటిప్రయత్నము లొనరింపఁదగును? ఈనుతకలహము లేల కలిగెను? మున్నె కోదయులభంగి నందఱము మెలంగుచుంటిమి. ఆపద్ధతి నామమాత్రావశిష్టమైన ట్లున్నది ఇఁకనైన మనము జాగ్రత్తపడకయున్న బాగులేదు. కార్యమునకుం బూనవలయును. పుణ్యమందిరమునుండి యీపలుగాకులఁ దఱుమగొట్టవలయును. గట్టిగా నీవిషయమునఁ బనిచేయవలయును.

ఆలసింపరాదు. ఆమందిరాభివృద్ధికిఁ దోడ్పడినవారలెల్ల రూరకున్నారు. తోడ్పడనివారే యందు సభ్యులుగనుండఁ గారణమేమి? అని యొక్కనాఁ డేకాంతమున నాలోచించి యామఱుదినమే యాపుణ్యమందిరమున సభఁగూర్పఁ బ్రయత్నించిరి. సభ్యులొనరించిన నియమములననుసరించి కార్యదర్శి నడుగవలసి వచ్చెను. వారికి వ్రాఁతమూలమునఁ దెలుపఁగా నీదినమున వలను పడ దనియెను. ఆనియమములందు మూలసూత్రముగా నింత ధనమిచ్చినవారు యావజ్జీవసభ్యులనియున్నది. వారందఱుకూడి వ్రాసినచోఁ గార్యదర్శి యడ్డముచెప్పరా దనునియమముకూడ నందుఁ బొందుపఱుపఁబడియుండెను. ఆవిషయము నా పెద్దలెఱుంగుదురు. కాన నెల్లరంగూర్చి యానియమమును దెలిపి రక్షకభటాధ్యక్షునిసాయముంగోరి నియమకాలమున నాపుణ్యమందిరమున నెల్లరుంగూడిరి. వారెల్ల యావజ్జీవసభ్యులే.

సభ యారంభమయ్యెను. కార్యదర్శియగు శ్రీనివాసగుప్త కొందఱనుచరులు తనయిష్టము ననుసరింపఁగా సభను సాగనీయరాదనుభావమున వచ్చెను. తలు పెవరుతెరిచిరి? అని సేవకుల గద్దించి యడిగెను. వారు పెదవులు తడుపుచు నూరకుండిరి. కపోలము లెఱ్ఱవాఱునట్లు తన్ని లోపలి కరిగి యెవరి యనుమతి నిందుఁ బ్రవేశించితిరని తిరస్కారపూర్వకముగా నడిగెను. మాకట్టియధికారముకలదని బదులు వినఁబడెను. వీరి నావలకుం బంపుమని యనుచరునకుం జెప్పుచుండఁగనే వారిరువురు తక్కినయనుచరులు ద్వారమునకు వెలుపల నుండవలసిన గతి యేర్పడెను. చూడఁగా రక్షకభటులు వారియధిపతియు వారిచిహ్నములతో నందుఁ బ్రత్యక్షమైరి. ఏమో యడుగఁ

బోవునంతలో నర్థచంద్రప్రయోగము లుపయోగమునకు రాసాగెను. దాన మఱియుం బదిబాహువులు సాగిపోవఁదగిన వారైరి. ఇంక మాటలాడినఁ గశాఘాతములు తప్పదనుధ్వని వినఁబడఁగా నెల్లరు తమతమశక్తిని బాదములనింపి యదృశ్యులైరి.

సభాకార్యమంత సాగ నారంభించెను. ఒక్కరు లేచి ద్వీపగౌరవమును బ్రశంసించి యప్పటిస్థితిని బోధించి రాఁగల యపూర్వమర్యాదలఁ దేటపఱచి మన మీపుణ్యామందిరము కారణమునఁ గల్గినకలహముల నడంచి క్రమముగా నట్టిమండగీంద్ర నడంపవలయునని తేటతెల్లముగఁ దెలిపెను. పుణ్యామందిరమూలసూత్రముల ననుసరించి కొందఱు సభ్యులుగా నుండఁగాదనుతీర్మానము నొకరుపపాదించిరి. ఎల్లరామోదించిరి. వారిపేరులు తెలుపఁబడియెను. వారెల్లరు కలహాశనులుగా నెల్లరు పేర్కొనువారే. సభాధిపతియుం గార్యదర్శియుం గార్యనిర్వాహకవర్గము వారు నిర్ణయింపఁబడిరి. ప్రాచీనసభానియమములు మరలఁ జేర్కొనఁబడి నెలకొల్పఁబడియె. నెలకొక్కసారి కార్యనిర్వాహకులసభ జరగవలయుననియు మందిరాభివృద్ధికిఁ దగినవిషయములు చర్చింపఁబడవలయుననియుఁ దీర్మానింపఁబడియెను. మఱుదినమునుండి కలహప్రియసభ్యులు పుస్తకభాండాగారమునఁ గలపుస్తకములఁ జదువుకొనరావచ్చుననియు, సభ్యులపట్టికనుండి వారిపేరులు త్రోసివేయంబడియెం గాని రాకపోకల కడ్డులేదనియు, సభాధిపతివ్రాఁత తెలియఁజేసెను. వచ్చినవారెల్ల వారిసద్బుద్ధి కానందించిరి.

తఱిమివేయఁబడినసభ్యులు తమలోఁ దారు గుసగుస లాడుకొనుచు వేఱొకమందిరము నెలకొల్పి దానిపేరు పెక్కుడల నెక్కులిపి పూర్వమందిరవిఖ్యాతిని నశింపఁజేయ సంకల్పించిరి. అందుఁ గొందఱు ధనముసేకరింప నియమింపఁబడిరి. లక్ష్మీనివాసదాసు భుజంగరాయఁడు లోనగువార లందుఁ బ్రముఖులు. వారు ధనవంతులకడ కరిగి తమ ప్రయత్నములఁ దెలిపిరి. ఇంకొకసారి రమ్మని కొందఱు, నాలోచింతుమని కొందఱును, ఈమందిర మీద్వీపమునకు నిపు డవసరమాయని కొందఱును బలికి సాగ నంపిరి. కాని మోమోటమి ధనమియ్యమని తొలుతఁ బలుకనైరి వీరు పలుమారు వారిండ్లకుం బోయి తొందఱపెట్ట సాగిరి అందుఁ గొందఱు విధిలేక మోమోటమివదలి యయ్యలారా! మీ ప్రయత్నము నెఱుంగుదుము. పుణ్యమందిరమును బాడుచేయఁబూనితిరి. దానిని గలహమందిరముగా మార్చితిరి. పెద్దలెఱింగి యచ్చట నుండనీయక తఱుమగా నీ ప్రయత్నమునకుఁ బూనితి రని తెల్లమయ్యెడిని ఈద్వీపములోఁ దమరు ప్రవేశించినది మొదలు గౌరవము నశించినది. కలహము లారంభించినవి. ఐకమత్య మెచ్చటికో పోయినది. ఇంకనైన మమ్మింత మర్యాదతో బ్రదుకనిండు. ఈదివ్యము కల్పవృక్షము. మీరు చీడపురుగులవంటివారు. తమసహవాసమున మూలమాత్రావశిష్టమై యున్నదీని నింకనైనఁ గాపాడుకొనఁ బ్రయత్నింతుము. నెమ్మదిగా నుంటిమి. మతకలహముల నీద్వీపవాసు లెఱుంగరు. ఉపాధ్యాయు లిట్టివారైన నిఁక నావిద్యామందిర మేలాగుండునో యోజింపవలయునా! ఈవఱకే యది పాడైపోవలసినదే. ఎట్లో యింకను నామమాత్రము నిలిచియున్నదని వినుచు

న్నారము. బాలకుల ప్రవర్తనము మీామూలమునఁ దాఱుమా
ఱయ్యెనని స్పష్టమగుచున్నది. ఇట్టి వెన్నియో చెడుగులీద్వీప
మునకు మీావలనఁగలిగినవి. ఇఁకెన్నికలుగనున్నవో యెఱుం
గము. కావున మీాప్రయత్నములన్నియు దుష్ప్రయత్నములే
యనియు, మీారెల్ల రసూయకుఁ బుట్టినిల్లనఁ దగువారలనియు
మాయభిప్రాయము. అట్టి మీారొనరించు నీజతనమునకుఁ
దోడ్పడఁజాలము. కావున వచ్చినదారింబొండు. అని మోమెత్తఁ
దనముఁదాల్పం బలికిరి. ఆమాటలు చెవిఁబడఁగనే యిఁక
నున్నఁ జీవాట్లుతప్పవని యొండుమాటలాడక కాలికి బుద్ధి
చెప్పిరి. తక్కినధనవంతులుకూడ నాపలుకు లెన్వారో వినిపింప
విని మరల వారరుదెంచిన నవ్వాని నొప్పగింతమని యెంచియుం
డిరి. ఇకార్యమునకు మసల నాసంఘు మెవ్వరికడకు రా
కయ్యెను. విశేషించి యాదుష్టసంఘుసభ్యుల యపూర్వవిఖ్యాతి
ప్రతిగృహమునందును వ్యాపించుటంజేసి వారి కేవిషయము
నందుఁ దోడ్పడరాదనునిశ్చితి మెల్లవారికింగల్గెను.



# ఆఱవ భాగము.

మహాసభ్యు లుత్తమోత్తమమార్గము నవలంబించినవా
రయ్యుఁ గొలఁదివత్సరములకు స్వార్థపరత్వ మునునధమాధమ
మార్గము నాశ్రయించిరి. కావున వారియందు విభేదములు
పొడకట్టెను. సంఘుద్రవ్యము నపహరింపరాదనియు నది మహా
పాతకమనియుఁ గలిగియున్న యాశయములు మాఱి "ఆపదర్థం
ధనం రక్షేత్" అనుసూక్తి చక్కనిదనియు నద్దాని నవలంబిం

చినఁగాని లోకమున మర్యాదనిలువదనియుఁ దోఁచెను. ధనార్జనమున కేవిసాధనములని వా రూహింపసాగిరి. సంఘద్రవ్యము ద్వీపమునకు వలయు కార్యములకు నుపయోగింపవలయు ననియుఁ జాలకయున్న దొరతనమువారిసాహాయ్యమును గోర వచ్చుననియు వారు కాలముననుసరించి తోడ్పాడుచూపుదు రనియు రాజశాసనము కలదు. మంచిబాటలు వేయించుట, దుర్గంధవస్తులవును దొలఁగించి యారోగ్యభాగ్యమును బెంపొందించుట, నూత్న గృహముల నిర్మించుపద్ధతులు బోధించి వారికి నప్పుగా ధనమిచ్చి యాధనము చక్కఁగా నాకార్యమునకే వ్యయింపవలయు ననుకట్టుపాటు చేసి యారీతిగా వారు వర్తించిరా యని కనుఁగొనుట యను నీలోనగు కార్యములకు సంఘద్రవ్యము వినియోగించుట మహాసభ్యులకుం గర్తవ్యముగా నుండును. నిర్వాహకుఁడు మహాసభ్యులయనుమతినొందనిది ధనము వ్యయింపరాదు. మహాసభ్యులు తామే యాధనమును వ్యయింపరాదు. తొలుత సభలో నీకార్యమున కింతధనమని తీర్మానింపవలయును. దానిఁ దత్కార్యమునకే నిర్వాహకుఁడు వినియోగింపందగును. అనియే రాజశాసనము. దాని మీఱి యెవ్వారును బ్రవర్తింపరాదు. ప్రవర్తించినచో వారత్యాచారులగుటయేగాక రాజాజ్ఞచేఁ బదభ్రష్టులుగఁ జేయఁబడుదురు. ఆధన మవ్వారివలన రాజోద్యోగులు గ్రహింతురు. ఈనియమముల ననుసరించి యాసంఘద్రవ్యము నెవ్వరుగాని యపహరింప వలనుపడదు. కాని యందఱొక్కటిగాఁ జేరి నపుడు ధర్మశాసన మేమిచేయఁగలదు?

మహాసభ్యులలోఁ గొంద ఱర్థార్జనాసక్తులై సంఘముగఁ జేరిరి. మఱికొంద ఱింకొకసంఘముగ నేర్పడిరి. తమబంధువులలోఁ గొందఱను బేరునకుమాత్రము మార్గనిర్మాణాదికార్యముల నొనరింప నియమించి వారల నాకార్యముల నొనరింప నిర్వాహకులచే సమ్మతి నిప్పించి కార్యము తీర్చినపిమ్మట వ్యయము కాఁగా మిగిలినధనమునఁ బేరునకుగాఁ గొంతనిచ్చి శేషద్రవ్యము దమరు సంగ్రహింప నెంచిరి. ఒక్కరిద్దఱిట్లుచేయఁగా మిగిలినవారిలోఁ గొందఱుకూడ మన మేల యూరకుండవలయునని యట్లే చేయసాగిరి. నిర్వాహకుఁ డావిధమెఱింగి తా నేల యూరకుండవలయునని మర్యాదగాఁ గొంతభాగము దనకీయవలయునని కోర నేకగ్రీవముగా నంగీకరించిరి. అది మొదలించుమించుగా నందఱు నీకార్యమున బద్ధాదరులై మెలంగసాగిరి. కావున నేకార్య ముపదానపూర్వకముగ సాగునట్లే యేర్పడెను. ఈవిషయము కొలఁది నెలలకే యెల్లయెడల నల్లుకొనియెను. కొందఱు మరల నెన్నికలలో సభ్యస్థులుగానిలిచి ధనము వెచ్చించియైన గెలుపొంది మర్యాదను దానికంటె నెక్కువగ ధనము నార్జింపఁగోరి యాకాలముఁ బ్రతీక్షించుచు నందులకు వలయుధనమును గృహక్షేత్రము లాధిపెట్టియైనఁ దెచ్చి సిద్ధము చేసికొని యుండిరి. సామాన్యులందఱు తమసమ్మతుల నట్టివారి కిచ్చిన లాభమేమియు నుండదుగానఁ దమరుకూడ వారివలన ధనమునార్జించుటయే యుత్తమమని తలంచిరి. ఈస్థితియందుండు నాద్వీపముబాగోగులు పాఠకమహాశయు లూహించినఁ దోఁపకమానవు. ఎల్లవిధముల నామహాసంఘము మర్యాదగోలుపోయెననియే యిందుఁగలసారము.

ఆమహాసభ్యసంఘమే యిట్లుండ నీకఁ దత్పరిపాలనమును లోఁబడినయున్నతపాఠశాలల స్థితి యెట్లున్నదని తెలిసికొందము. లక్ష్మీవిలాసదాసు భుజంగరాయప్రభృతు లొక్క సంఘముగానుండి పురుషోత్తమరాయనిం గష్టపెట్టుచున్న యట్టు లీవఱకే పాఠకులు చదివియున్నవారు. వారికెల్ల సూత్రధారుఁడనఁదగువాఁ డోడ్యాణపురరాజస్వామి యనుమాట మఱువరాదు. చూచుటకు మహాశాంతమూర్తిగాఁ దోఁచుచుఁ గుటిలవృత్తులకుఁ దానే సాగరమనందగి యెల్లరయుల్లములను గనిపెట్టి తగినయట్లు మాటలాడుచు నన్యోన్యద్వేషములు గలిగించుచు దానిం గ్రమముగాఁ బెంచుచుఁ దాను మర్యాద యెఱింగి న్యాయ్యముగా వర్తించినట్లు నటించుచు నభినవనారదమునియై యోడ్యాణపురరాజస్వామి కాలముం బుచ్చుచుండెను. లక్ష్మీవిలాసదాసుఁడు, ఓడ్యాణపురరాజస్వామియు నిరుప్రక్కల నొక్కొక్క వంకలొత్తుచుండ భుజంగరాయప్రభృతు లున్మత్తులకరణి మెలంగుచు దాన రాఁగలచెడుగుల గుఱుతింపక నలువురుపెద్దలు తమ్ముంగూర్చి యేమందురో యని యోజింపక కపటోక్తులకు జిక్కరాదను నూహచేయలేక యుండిరి. పురుషోత్తమరాయఁడు వారి కుచర్యల గుఱుతించియు నాక్షేపించి వీరిచర్యలఁ బరిపాలకులకుఁ దెలిపినలాభములేదని యెట్లో కాలముం బుచ్చుచుండెను. ఈవిధమెఱింగి విద్యార్థులు చదువమాని తోఁచినపుడెల్ల నేదో కార్యముసకని యిండ్లకుఁ బోవుచుండిరి. ఉపాధ్యాయులుకూడఁ గాలము లెక్కించుచుఁ గూరుచుండి కడుపులోనిచల్ల కదలక యుండ నిండ్లకుంబోవుచుండిరి. పరిపాలకుల న్యాయవర్తన

ముపాధ్యాయుల సద్వర్తనమునకుఁ దోడ్పడ నెంతబాగుండునో యద్దానికిం బ్రతిపక్షముగా నయ్యెవి యొప్పెను. కావున దైవ దుర్విపాకమున నిట్లు సాగుచున్నవని సజ్జను లూహింపవలసిన యవకాశము కల్గెను.

ఒక్కతటిఁ గారణాంతరమునఁ బురుషోత్తమ రాయఁడు దేశాంతరజిగమిషం బూనెను. నీలాద్రిరాజస్వామి రెండవ వాఁడుగా నుండెను. కావున నతఁడే యాపదము నొందఁజాలు నని యెల్ల రూహించిరి. ఆతని ప్రవృత్తియు విద్యార్థుల కతనిపైఁ గలవిరాగమునను నీరెండు నాతని దురదృష్టవంతునిగా నొనర్చెను. కావున నిర్వాహకుఁ డితరుల ప్రోత్సాహమున నవీన విద్వాంసు నాపదమున నధివసింపఁ జేసెను. దానఁ గ్రిందనున్న యుపాధ్యాయు లాతనిపై నీసుఁబూనిరి. నవీనవిద్వాంసుల పేరు క్రొత్తది కాన దానిని బాలకులకుఁ దెలుప వలనుపడ దయ్యెను. పరస్పరద్వేషము సర్వానర్థమూలకమని యందఱెఱుంగుదురుకదా. ఆవిధమెఱింగి విద్యార్థులు తమకర్తవ్యమును మాని విచ్చలవిడిగఁ దిరుగసాగిరి. వారికి విద్యనేర్పు నుపాధ్యాయులు కుతూహలమును బూనకయుండిరి. క్రొత్తవాఁడగుటఁ బ్రధానోపాధ్యాయుఁడు వారిపైఁ గినుకఁబూని సాధింప సాహసింపఁడయ్యెను. తనపదవి స్థిరముకామి నతఁ డూరకుండెనని కొందఱి యభిప్రాయము. ఎట్టులైననేమి? పాఠశాల స్వగౌరవమును బోఁగొట్టుకొన సిద్ధపడుచుండెను. అనంతగిరిశాస్త్రి కుమారశర్మ మొదలగు పండితులు నరసింహమూర్తి లోనగుకొంద ఱుపాధ్యాయులు పాఠశాలదుస్స్థితికి వగచి బాగుచేయఁబూనిరి. కాని భుజంగరాయలక్ష్మీనివాసదాసు

లోనగువారి కుతంత్రమువలన నది విఫలము కాఁజొచ్చెను. క్రమక్రమముగా నాకుజనసంఘము నదలింపఁ దక్కినవారు సమర్థులు కాఁజాలకయుండిరి. మహాసభ్యసంఘమున కిట్టిదశయే పట్టినందున నిర్వాహకుఁడు లోనగువారు విద్యాశాలను జక్కఁ జేయఁజాలునంతవారు కాఁజాలక యుండిరి. ఎట్టులైననేమి? పాతాళద్వీపము సకలవిధముల మర్యాదపోఁగొట్టుకొనుచుండె ననియే మన మూహింపవలయును.

ప్రాయికముగా లోకమునఁ గుమతులే యన్నివిషయముల మర్యాద కావలయునని కోరుచు నితరుల కాభావమును దెల్పుచుందురు. సుమతు లద్దానిం గోరరుకాని యది తన యంతన వారల నాశ్రయించును. కావలెనని ప్రయత్నించిన నది రాదు. మానవుని ప్రవర్తనమే యద్దానిం గలుగఁజేయును. విపరీతప్రవర్తన మద్దాని దొలఁగఁజేసి దానిస్థానమున నపూర్వ మర్యాదను బాదుకొల్పును. మేము మర్యాదగలవారలమని యెవ్వరెవ్వ రితరులతోఁ జెప్పుచుందురో, వారు దానికి దూరముగా నుండఁదగినవారే యనవలయును. కాని వారు మర్యాదగలవారలము మేమే యని తలంచుచుందురు. పాతాళ ద్వీపమున నట్టిదుష్కాలముననే జాతరసాగెను. అది క్రొత్త పద్ధతిగా నితరదేశములకుఁ దోఁచును. గ్రామదేవతోత్సవ మునకే జాతరయని పేరుకలదు. ప్రఖ్యాతమైన పేరదియే. ఆద్వీపమున నాజాతర గ్రామదేవతలకుంగాక హరిహరస్వామికే సాగును. విష్ణుభక్తులు శివభక్తులుకూడ దాని నామోదింతురు. చిన్న దేవాలయమున నొకవిగ్రహము ప్రతిష్ఠింపఁబడియుండెను. హరిహరస్వామి యని దానిం బిలుతురు. కాని యావిగ్రహ

మున్ను జూచినవారు కృష్ణస్వామియే యనితలంతురు. ఆపాషాణ చిహ్నము లట్టివిగ నుండును. హరిహరస్వామి యనఁగా నా విగ్రహమున నొకభాగమున విష్ణుచిహ్నములు వేఱొకభాగ మున శంకరుచిహ్నము లుండును. కొందఱు వైష్ణవులు కొందఱు శైవులును దానిని భక్తిమెయిఁ గొలువరు. వారు పాషండు లగుటయే యందులకుం గలకారణము. ఈయిరుదెగలవారిలోఁ గొందఱారాధింతురు. కాని యొక్కొక్కప్రక్క చిహ్న ములనే వారు ప్రేమింతురు. పైవారికన్న వీ రుత్తములే యనఁ దగుదురు. తక్కినవారెల్ల రెండు రూపములుగలవాఁ డొక్క భగవంతుఁడేకదా యని దాని భక్తిమెయిం బూజింతురు. అదియే జ్ఞానలక్షణమని పాఠకు లూహింతురు.

ఆజాతర హరిహరనాథస్వామి నుద్దేశించినదికదా. అందుఁ బౌరులెల్లరు పాల్గొందురు. ఆపర్యాయ ముపాధ్యాయులు విద్యార్థులుకూడఁ బాల్గొనిన మేలని ప్రధానోపాధ్యాయుఁడు, నుపాధ్యాయయుఁ దమపాఠశాలలయందు వెల్లడించిరి. ఎల్లరు నట్లే చేయ నంగీకరించిరి. ఆదిన ముత్సవమున కగువ్యయమం తయు వారే భరింప నంగీకరించిరి. విద్యార్థులనుండి కొంత ధనము ప్రోగుచేయఁబడియె. బాలికలు కొంతధన మిచ్చిరి. బాలి కాపాఠశాలయందలి యుపాధ్యాయీబృందము యథోచిత ముగ ధనమిచ్చిరి. బాలకులపాఠశాలయందలి యుపాధ్యాయు లలో నొక్కసంఘము ప్రధానోపాధ్యాయునిపైఁ గల యీర్ష్యచేఁ దొలుత నంగీకరించితిమే యనియైన నూహింపక తోడ్పడకయుండ వలయునని మాటలాడుకొని ధనమీయక మరలఁ జూతమని కాలముం బుచ్చసాగిరి. ప్రధానగురు వీవార్త

నెఱుంగఁడు. అనంతగిరిశాస్త్రి ప్రధానగురువునాజ్ఞఁ గార్యము నిర్వహింపఁబూనెను. అతఁ డధిపతిపక్షమువ్రూనె నన్న యీాసున నతనిమాట లాడింపక యాసంఘము విముఖతఁగాంచెను. ఉత్స వమునాఁడు చదువుకొనుచుండుబాలికలు బాలకులు ధౌతవస్త్ర ములుధరించి సంతోషము మోములఁ దాండవమాడఁ బూల మాలికలఁ జేతులఁబట్టుకొని యొక్కసారిగాఁ బయనముసాగిం చిరి. పాఠములుచెప్పుచున్న పురంధ్రీమణులెల్ల వారితోఁ దర లిరి. ఉపాధ్యాయులు కొందఱుమాత్రమే వారితోడ నుండిరి. ప్రథమగురువుకూడ నుండెను. హరిహరనాథస్వామియాల యముదనుక నీయుత్సవముసాగెను. భగవన్నామసంకీర్తనము లతోఁ బోవుచుండువారలం గాంచి పౌరులెల్లఁ బరమానంద సాగరమున నోలలాడఁజొచ్చిరి. కరతాళధ్వనులు మిన్నుముట్టు చుండెను. దేవాలయమునకుం బోయి తమతెచ్చినకానుక లర్పించి భగవంతుని దివ్యరూపముం గాంచి మనస్సున దానిం బదిలపఱచుకొని యిండ్ల కెల్లరుంబోయిరి.

ఆయుత్సవము పౌరముఖ్యప్రీతిపాత్రమగుట కెంతయుఁ దల్లడంపడి యాయుపాధ్యాయసంఘము కుందఁజొచ్చెను. తక్కినవారిపై మండిపడసాగెను. చూచినపెద్దలెల్లరు ఛీ! ఛీ! యనసాగిరి. పాఠశాలయం దిట్టిభేదములు పొడకట్టెనని యివి దానినాశనమునకు హేతువని యెల్లరు తలంపసాగిరి. ద్వీప స్వభావముఁబట్టి వారి నేమనకపోయినను మనస్సులయం దెల్లరు నేవగించుచుండిరి. బాలికలకుంగూడ నీవార్త తెలియ రాఁగా వా రసితగునా యని యాక్షేపింపసాగిరి. ఎవ్వ రేమన్నను దాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనునట్లు మర్యాద

మాని. లజ్జను దిగనాడి తమపట్టు వదలక వారు ప్రవర్తింప నిశ్చ యించిరి. నాఁడు మొదలు పారశాలవర్తనము తాఱుమాఱు లయ్యెను. తక్కుంగలవారితోటిసంబంధ మాసంఘమునకు లేద య్యెను. నానాఁటికి విద్యార్థిబృంద ముపాధ్యాయసంఘము మూలమున గురువులయందుఁగల విశ్వాసమును విడనాఁడ గల్గెను. దుస్సంగతి సకలాపన్మూలముకదా!

ఉ. ఓర్వక దుర్జనుండు కఠినోక్తులు సజ్జనుఁ బల్కెనేని దు
ర్గర్వుఁడు గాక యాతఁడు వికారము నొందఁ డొకింతయేని తా
నార్వశిఖం గలంగని మహాబ్ధిజలంబు తృణాగ్ని వైచినన్
దుర్వహదుఃఖభారమయి తోడనె తాపముఁ బొందనేర్చునే.

అనున్యాయము ననుసరించి యాసంఘ మెన్నిరీతుల దూషించి నను దక్కినయుపాధ్యాయులు మాఱుపలుకక యూరకయుం డిరి. తమపనులఁ జక్కఁగ నిర్వహించుచుండిరి.

---

# ఏడవభాగము

"అంతః ప్రచ్ఛన్న పాపానాం శాస్తా వైవస్వతో యమః"

అన్నసూక్తి యమోఘము. మానసికదోషములు నరకకూప మునఁ బడఁద్రోయక మానవు. ఎంత దాఁచిన నవి బయల నుబ్బకపోవు. ప్రాయికముగా నితరులకుఁ దెలియకయుండ లోకుల మోసపుచ్చితి మని కొందఱు తలంతురు. అది మిగులఁ బొరపాటు. మానవునికృత్యమును బరీక్షించుభూతము లనేక ములు గలవు. వానితత్త్వ మెఱుంగక కొందఱు రహస్యముగ

దుష్కార్యముల నొనరింతురు. అవి కొలఁదిదినములలో బయల్పడకమానవు. ఇయ్యది సిద్ధాంతము. ఈవిషయము నెందఱో పరీక్షించి తమవాదము గెలువకపోవఁగాఁ దుదకు నాసిద్ధాంతమును శిరసావహించిరి. ఈసిద్ధాంతమును బ్రకృతచరిత్రమున సమన్వయింతము.

పాతాళద్వీపము కలహాభూయిష్ఠమయ్యెనని పాఠక మహాశయు లెఱింగియే యుందురు. దినదినాభివృద్ధిఁ గాంచి యవి యెవ్వారికిఁ దీర్ప నలవిగానివయ్యెను. వానిభీకరాకృతులం బరికించుసాధువులు భయంపడసాగిరి. సాధువుల కేమిభయమని కొందఱందురు. అది పొరపాటు. ద్వీపగౌరవమే సాధువులకుం బ్రియము. అది పోవుటయే వారికి దుఃఖము. అద్దానివలన భయమే కాని వేఱు కారణము లేదు. దుష్టుల కయ్యది సంతోషదాయకము. ఏలన మర్యాదవలన వారికిం గష్టములే కలుగుంగాని సుఖసంపదలు వారికిఁ గలుగవు. అంతియగాక మర్యాదాస్వరూపము వా రెఱుంగరు. ఎట్టులైన నాలుగుడబ్బులు దొరకుటయే వారికిం గావలయు. సజ్జనులకు ధనము ప్రధానము కాదు. మర్యాదయే ప్రధానము. మర్యాద సద్వర్తనమున గలుగునది. దానిం గడించు టెంతో కష్టము.

చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిలఁ గొండమీఁదికిం
గడపఁగ భార మచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గద్రోయఁగాఁ
గడుసులభంబ యట్లు గుణగణ్యుఁ దనం బొగడొందు టద్భుతం
బుడుగక దుర్జనుడనఁగనుండుట దా సుకరంబు ధాత్రిలోన్.

అన్న నీతి ప్రసిద్ధమే కదా. కనకము పుటపాకశోభితమై సువర్ణము గలిగి సువర్ణ మనంబరఁగు. కష్టముల కాకరముగానొప్పు

కార్యములను సాధించి సుయశోవిరాజితులై సాధువులు ప్రకాశింతురు. కష్టకార్యములకు దూరముగనుండి యసాధువు లయశస్సంక్రాంతిఁ దూలుచుందురు.

కొంతకాలమునకు బాలికాపాఠశాలమిక్కిలి ప్రఖ్యాతిం గాంచెను. బాలకులపాఠశాల దినదినక్షీణతం గాంచఁ జొచ్చెను. ఉపాధ్యాయులప్రవర్తనమే యందులకుం గారణమని పెక్కండ్ర భావము. కాలగతియే కారణమని దేవానాం ప్రియుల భావము. ఏది యెట్లున్ననేమి? క్షీణించుచుండుటమాత్రము సత్యము. ద్వీపమునఁగల కలహములెల్ల వీరిమూలముననే కలిగినవని యెల్లరు తలంపసాగిరి. ఎవ్వ రేమనుకొన్న నేమి? కార్యమును మేముచేయక మానమని యాయుపాధ్యాయసంఘము కలహములఁ గల్పించుచు నవి వృద్ధికాఁగా నానందించుచుఁ బాఠశాలకుం గల్గిన యపకీర్తిని దమమర్యాదగాఁ దలంచుచుఁ దిరుగుచుండిరి. బాలురు నియమితకాలమునకుఁ బాఠశాల కరుగక విద్యనభ్యసింపక స్వేచ్ఛగాఁ దిరుగసాగిరి. "కాపఱిలేనిగొఱ్ఱెయలకైవడి" నన్నమాట సార్థక మయ్యెను.

ఉన్నతకక్ష్యయందు విద్య నభ్యసించువిద్యార్థు లిరువురు సుదర్శనుఁడు శంకరుఁడు ననువార లొక్కనాఁడు కూడి యేమో మాటలాడుకొనుచుఁ దమవిద్యాశాలదుస్స్థితి స్మృతికిం దగులగా దానింగూర్చి ముచ్చటింపఁ జొచ్చిరి. అప్పుడే యొక యోగి యచ్చటికి వచ్చెను. ఆయోగిం గాంచినంతనే వారు లేచి కూరుచుండవలయునని వేఁడిరి. కూరుచుండి యోగి వారింగూరుచుండ నియోగించి యూరకయుండెను. వా రాతని బ్రశ్నింపఁగోరి యాతనిముఖమును దిలకించి స్వామీ! ప్రశ్న

మొకఁడు చెప్పవలయును. తమరు మహాత్ములుగాఁ దోఁచుచు న్నారు. మాపాఠశాల యిట్లే వరుసగా క్షీణించి పోవునా? కొంతకాలమునకైన బాగుపడునా? ఈవిషయ మెఱుంగఁగోరి యున్నాము. మాయెడఁ బుత్త్రవాత్సల్య మునిచి యనుగ్ర హింపుఁడు. అని దోసిలొగ్గి వేఁడఁగా నాయోగి యిట్లు బదులు చెప్పెను. బాలకులారా! చక్కని ప్రశ్నము చేసితిరి. పరమా నంద ముదయించెను. ఎందఱో విద్యార్థు లిందుఁగలరు. వారికి లేనియక్కఱ మనికేమి యనుకొనక మీరు పాఠశాలవృద్ధిం గోరి విచారించుచున్నారు. ఇదియే మీపురోవృద్ధిని దెలుపు చున్నది. వర్ధిష్ణువులని తోఁచినందుననే మీకడ కరుదెంచితిని. మీసంశయమును దెలిపితిరి. భావిఫలములనడిగితిరి. మీవంటి వార లడుగకయున్నను దెలుపుటయే మాకు విధి. అట్టులుండ నడిగినపుడు తెలుపుటకు సందియమేమి? వచింతును. ఆలకింపుఁడు.

వృద్ధిక్షయములు ప్రతివిషయమునఁగలవనియే నమ్ముఁడు. ఒక్క దేశముగాని, ఒక్కగ్రామముగాని, ఒక్కస్థలముగాని, ఒక్కవ్యక్తిగాని యొక్కపుడు ప్రఖ్యాతిం గాంచును. ఒక్క పుడు గౌరవమును బోఁగొట్టుకొనును. ఎంతకాల మట్లుండు నదియు సామాన్యు లెఱుంగఁజాలరు. స్థలమునకు వృద్ధిక్షయము లుండునాయని యనుమానింపకుఁడు. మనవృష్టి కయ్యది యప్రా ణిగాఁ దోఁచును. మనవంటి దది కాదనవచ్చును. భగవత్కళ యందును గలదు. అయ్యది వృద్ధినొందుకార్యము లేవ్యక్తి గాని చేయుచుండిన నయ్యది ప్రఖ్యాతిం గాంచు. ఒక్క స్థల మాపరక్షేత్రమువలె నుండు ననుకొనుఁడు. ఒక్కకాల మున నొక్కధనికుఁడో పృథివీపతియో యందు నారాము

మును బ్రతిష్ఠించును. దాని నాశ్రయించి యెన్ని యోప్రాణికోటులు జీవించును. ఎందఱో మానవు లద్దానిం గాంచియు నందలి పుష్పఫలముల ననుభవించియు నానందింతురు. సంతృప్తులగుదురు. దాన నందుఁగల భగవత్కళ నిర్మలమై వృద్ధి నొందును. అక్కాలమున దానిని స్థలభోగ మందురు. కొంత కాలమున కయ్యది క్షీణించుచుండ దుష్టప్రాణికోటి యంపుఁజేరును. సాధుప్రాణికోటి కెన్ని యోవిధములనపకారము చేయుచుండును. దాన నాప్రాణికోటి వంతఁగుందు. దాన నయ్యది క్రమముగా క్షీణించి తుదకు నశించును. అదియే దానికి దురదృష్టకాలమని నమ్మవలయు. ఇట్లే యన్ని విషయములని యెఱుంగుఁడు. మీ యల్పకాలానుభవమున నిట్టివాని నెన్నింటినో చూచియున్నారు. విమర్శింపనికతన వాని తత్త్వము మీకుఁ జక్కఁగా బోధపడకయుండవచ్చును.

ఆమాట వినినంతనే వారిరువురును స్వామీ! సాధుజంతువు లివి యని యసాధుజంతువు లివి యని యెఱుంగు టెట్లు? తెలుపుమాయని వేఁడిరి. నవ్వి యా యోగి యిట్లుపలికెను. ఇతర ప్రాణులకు హానిచేయక జీవించునవన్నియు సాధువు లనఁబడును. తమకై యన్యప్రాణుల హింసించునవియెల్ల నసాధువు లనంబడును. ఒక్కయాహారముననే యీపరీక్ష మనుష్యులు కానిజంతువుల కని యెఱుంగుఁడు. మానవుల ననేకవిధములఁ బరీక్షింపవలయు. ఇతరుల హింసింపనియాహారముం గొనువారుకూడఁ గ్రూరులై చెడుతలంపులు గలిగియుందురు. మనోదుష్టు లనఁబడువారు వారే. ఆదోషమే కాక పరవినాశనసూచనములుగ మాటలాడు వారు కొందఱు గలరు. వారు వాగ్దుష్టు లనంబడుదురు. ఈ రెం

దును లేకయుండువారు సాధువు లనంబడుదురు. వేషమును జూచి కొందఱు సాధువులని పొగడుదురు. అది పొరపాటు. వేషధారులు తఱచుగా లోకవంచకులు. తమపనికై యెన్నియో వేషములఁ దాల్తురు. వారివృత్తి యెట్టిదనియే మతిమంతులు పరికింపవలయును. వేషమునఁగాక వృత్తి నెవ్వారు పరిశుద్ధులుగా నుందురో వారే సాధువు లనందగినవారు. మీ రెప్పుడును వేషమును బాటింపక వారిప్రవర్తనమునే పరీక్షించుచు మీకు సంతోషమును గలిగించుటయేకాక న్యాయసమ్మతము జనసమ్మతముకూడ నగునేని వారిని సాధువులని తలంపుఁడు. వారిమాటలను విశ్వసింపుఁడు. సకలవిషయముల నిట్లే యెఱుంగఁదగుదురు. ఇఁక మీ మొదటిప్రశ్నమునకు బదులు వచింతు. ఆలకింపుఁడు.

లోకవంచకులగు నుపాధ్యాయులుకొంద ఱిందుఁజేరిరి. వారు కుటిలమతులు నలసులు నగుదురు. తమవంటివారి నొక్కకొందఱిని మిత్రులనుగాఁ జేర్చుకొనిరి. ఒక్కమాటగా నంద ఱుండఁ బలికికొనిరి. తక్కినవారితో ద్వేషించిరి. వారేమిచేసిన నూరకుండవలయుననియే వారియభీష్టము. ప్రధానోపాధ్యాయుఁడు వారిపైఁ గినుకవూనియుఁ బైవారిప్రవర్తనము న్యాయ్యముగామిఁ జేయునదిలేక యూరకున్నవాఁడు. ఆతఁడు తమ్మేమియుఁ జేయఁజాలఁడని యూహించి వేతనమునకై దినములు లెక్కించుచు విద్యార్థుల భయపెట్టుచుఁ బాఠముచెప్పక యున్నవారు. కావున వారిపై బాలురు మర్యాదలేకయున్నవారు. వార లంతతో నూరకయుండక బాలుర నుపాధ్యాయులపైఁ గినుకఁబూనఁ బురికొల్పుచున్నారు. కాని వార లం

దులకు లోఁబడక యింకను మర్యాద నునిచియే యున్నారు. కొంతకాలమున కదియుఁ దొలఁగును. అత్తటి మఱికొంత పాఠశాల మర్యాదఁ గోలుపోవును. కాని యట్లే చాలకాలము నిలువదు. అధికారులు మంచివారరు దెంతురు. ఈయుపాధ్యాయసంఘము మర్యాదఁ బరికింతురు. దుష్టసంఘముఁ బరీక్షింతురు. నిలువలేక యాసంఘమే తొలంగును. మఱెందుఁగూడ నాసంఘము మర్యాదం గాంచఁజాలదు. దానిస్థానమున నియమింపఁబడు నుపాధ్యాయసంతతి మర్యాదనూని ప్రవర్తించును. దినదినాభివృద్ధినొంది విద్యార్థిబృందము విద్య నభ్యసించుచు సదుద్దేశముల నలరారు. ఆకాల మింక మూఁడువత్సరముల కరుదెంచు. ఆమీఁద నీపాఠశాల ప్రఖ్యాతిం గాంచు. ఇదియ దీని భావిభాగ్యము.

అనుటయు సుదర్శనశంకరు లిరువురు చింతామోదములు పెరిఁగొన నాయోగిపలుకులు సత్యములే యని నమ్మి వెండియు నిట్లనిరి. మహాత్మా! తమ వాక్కులమోఘములనియే మావిశ్వాసము. కరుణార్ద్రహృదయులుగాన మిమ్మొక్కఁటి యర్థింతుము. మాయిరువురభాగ్యము లెట్టివిగనుండునో వచింపుఁడు. దాఁపక తెల్పుఁడు. చెడుఫలములకు దుఃఖింపము. కానున్నవి గాక మానవు. అని వేడఁగా నాతఁ డిట్లనియె. బాలకులారా! వర్ధిష్ణువులగుదు రని మున్నే వచించితి. మీప్రశ్నమునకుఁ దగు నుత్తర మం దిమిడియున్నది. అంతకుమించి వచింపవలనుపడదు. మీరు నాయాశ్రమమునకు రండు తెలుపఁదగువానిం దెల్పెద. అయ్యది యీద్వీపమున నీశాన్యభాగమునఁగల కలశభూధరమున నెట్టనిరంగునఁ గనంబడుభాగమునకుఁ గ్రిందఁ గలదు. అందు మృగబాధ యుండదు. మంచినీరు సమృద్ధిగా దొరకును.

సెలయేఱొండు ప్రవహించుచుండు. ఆసానువున నెల్లెడలఁ గల శాకారములగు పాషాణములు పెక్కులుండుటంబట్టి కలశాద్రి యని యాకొండ ప్రఖ్యాతిం గాంచెను. నిర్భయముగా మీరు రావచ్చును. అనఁగానే వారిరువురు పాదములపై వ్రాలి మీ వెంటఁ గొనిపొండని ప్రార్థించిరి. వారిపట్టుదల కెంతయు నానందించి వారిఁ బిలుచుకొని తనయాశ్రమమును జేరెను.

ఆయోగియాశ్రమము నదీతీరమున నున్నది. వృక్షవాటికలనడుమ నది కన్నులపండువుగాఁ గనంబడును. నదీజలములద్దాని బాధింపఁజాలవు. నదీతీరము పాషాణసమావృతము. అత్యున్నతము. దానిని భేదింప జలములకు శక్తిచాలదు. నీటిపైనుండి పిల్లవాయువులాయాశ్రమమునఁ బొలయుచుండును. ఋతువులాఱింటను దొరకుపండ్లందుఁ గలవు. విశేషించి కందమూలములు గలవు. సామాన్యుల కది యాశ్రమముగాఁ దోఁపక యడవిగాఁ దోచును. కుటీర మావృక్షవాటియం దెందుండునదియుఁ దెలిసికొన వలనుపడదు. నదీజలమే యాశ్రమమున నుండువారి కాధారము. దూరమునఁ గాక జలము తీరము నంటియే యుండును. సోపానములవలెఁ బాషాణములు దైవముచేఁ గల్పింపఁబడియున్నయట్లమరియుండును. ఆరోగ్యభాగ్యమునకుఁ గొఱంత లేదు.

ఆశ్రమముంజేరిన మఱుదినము వారిం గాంచి యోగి యిట్లు పలికెను బాలకులారా! మీరు నీతిశాస్త్రమెఱుంగఁ గోరువారని యెఱింగితిని విశేషించి తెలుపఁదగినవానిని ముందు ముందు తెల్పుదు. మీవయస్సునుబట్టి యిప్పటి కావశ్యకములగువానిం దెల్పెద. వినుఁడు. మీకంటెఁ బాటుపడువారెవ్వరో వారితో స్నేహముగలిగియుండుఁడు. అది మీయభి

వృద్ధికే హేతు వగు. చెడుతలంపులుకలవా రెంతమిత్రులైనను వదలిపెట్టుఁడు. వారితో విరోధింపకుఁడు. దానఁ గొన్ని యిక్కటులు వాటిల్లును. పెద్దలమాటల నాలకింపుఁడు. అంతతోఁ దృప్తినొందక వానిని విమర్శింపుఁడు కొంత కాలమున కొక్క విధమగు ననుభవము గల్గును. ఆవల మీరే యితరులకు సన్మార్గమును బోధింపఁగలరు. గురూపదేశము స్వానుభవము— అనువానిని మీరు వినియే యుందురు. పై మాటలివియే యని నమ్ముఁడు. శక్తి లేకున్నను సత్కార్యములఁ జేయ సంకల్పించుచుండుఁడు. ఆసంకల్పమే మిమ్ముద్ధరించును. దుస్సంకల్పముల నెప్పుడును జేయకుఁడు. అధోగతి కదియే మీకు మార్గము చూపును. ఒకరికలిమి కసూయపడకుఁడు. దురాచారములలో నదియే ప్రధానము. అంతియ కాక యది భగవంతునికిని మీకుఁ గడుదూరమును గల్పించును జూడుఁడు. పేదల కిత్తుమని యాస గల్పింపకుఁడు. శక్తి కనురూపముగా సాయపడుఁడు. దీనాంధబధిరకుబ్జులను, వికలాంగులను జూడఁగనే భగవంతుని బ్రార్థింపుఁడు. వారి నుద్ధరింపుమనియే యది యుండఁదగు. మాయపరాధములనెంచి మాకష్టబాధలఁ గల్పింపకుమా యని దైవమును గోరుఁడు. ఆకోరిక కాపరమేశ్వరుఁ డానందించును. ఆశగలవారు మీరని భావింపక యాదైవము కరుణించుఁ జూఁడీ మీకంటె ధనవంతులతో స్నేహము బంధుత్వముఁ గల్పించుకొనకుఁడు. కల్పించుకొనుదురేని పెక్కుకష్టములపాలగుదురు. మిత్రులతో వాగ్వాదము చేయకుఁడు. మైత్రి నది పాడుచేయును. మఱియు వారికడ నప్పుతీసికొనకుఁడు. వారికుటుంబముతో విశేషించి మాటలాడకుఁడు. తఱచుగాఁ బరుల యిండ్లకుం బోవు నలవాటు చేసికొనకుఁడు. దాన ననేకకష్ట

ములు గలుగు. పరిహాసమునకైన డంబములు పలుకకుఁడు. అవియే మీపురోవృద్ధి నడ్డగించునవి. దాంభికు నెవ్వరు నమ్మరని నమ్ముడు. చెప్పనిపెత్తనము నెత్తిన వైచుకొనకుఁడు. ఎంత శ్రమించినను దాన మేలు కలుగదు. మాటయిచ్చి మరలకుఁడు. అదియే మీకు మర్యాదనుగూర్చును. మీకంటెఁ జిన్నవారితో స్నేహముఁ గల్పించుకొనకుఁడు. అది మీమర్యాద నడంచును. మాటకుముందు నవ్వరాదు. దురభ్యాసములలో నొక్కటి యది యని నమ్మవలయు. అంధకారమునఁ జెంత లేనివారివిషయమున నేదియుఁ బల్కకుఁడు. అది యనర్థహేతువగు. గురువులతో మేలము లాడకుఁడు. అది మీకు హాని నుత్పాదించును. ఒంటరిగాఁ దిరుగు నభ్యాసము మంచిది కాదని విశ్వసింపుఁడు. దూరముగా నుండువారిని వ్రేలుతోఁ జూపకుఁడు. అది యవమానమును బుట్టించును. లేనిమర్యాద గలదని తలంపకుఁడు. అల్పునితో విశేషించి సంభాషింపకుఁడు. ఉన్నమర్యాద దాన నూడిపోవును. ఇంతమాత్రము మీకిపుడు చెప్పఁదగునని తోఁచెను. మీరిఁక నిండ్లకుం బోయి మీరాకకై చింతించు మీజననీజనకుల కానందముఁ గల్గించి విద్యార్థులకెల్ల మేలుబంతు లనిపించుకొనుచు మంచినడవడి నెల్లర మెప్పువడసి చిరకాలము యశస్సుఖములం గాంచి ముదుసలితనము పొడసూపఁగా మరల నిచ్చటికి రండు. ఇఁక మీరు ప్రయాణము చేయుఁడని సాగనంప వారిరువురు మహాయోగికిఁ బ్రణమిల్లి పనివినిరి.

కొడుకు లెచ్చటికిఁ బోయిరో యని వారితల్లిదండ్రులు కొందలంపడుచుఁ బాఠశాలయందలి యత్యాచారముల దూఱుచు నెవరో దుష్టబాలకులు తమకొడుకులం బిలుచు

కొనిపోయిరని చింతించుచు నుపాధ్యాయుల నాక్షేపించుచుం బలువేతలం బడుచుండిరి. మఱుదినముసాయంకాలము వారు పాతాళద్వీపముం జేరిరి. వారిం గాంచగనే యెల్లరు సంతోషించి వారియుదంత మడుగ వారియిండ్లకుంబోయిరి. తనయులం జూచి తల్లిదండ్రు లింత యనరాని సంతసము నొందిరి. వారు తమచరిత్రముల వినిపింపఁదగినయంతవట్టు తెలిపిరి. మఱు దినమునుండి వారు పాఠశాలకుంబోవుచు గురువులయానతి మీఱక చదువుకొనుచుండిరి. విద్యాశాల క్రమముగా క్షీణింప సాగెను. ఉపాధ్యాయసంఘమం దనేకభేదములు గలుగుటయు నందుఁ గొందఱు ప్రధానోపాధ్యాయుని లెక్కింపక మెలంగుటయు వారి నేమనుటకు వలనుపడక యతఁడుండుటయు, విద్యాశాలబాగోగులు కనుఁగొనుట మాని ధనార్జనమున నధికాదరము నామహాసభ్యులు నిర్వాహకుఁడు చూపుచుండుటయుఁ గారణములుగా నాపవిత్రవిద్యాశాల స్వీయగౌరవమును నామమాత్రావశిష్టముగ నుంచుకొనునదయ్యెను. పాతాళద్వీపవాసులలోఁ బెద్దలు కొంద ఱందులకు విచారపడుచుండిరి. కొంద ఱందుఁ గాలగతి యిదియని పెదవులు విఱుచుచుండిరి. దీని నెట్లు బాగుచేయుట యని కొంద ఱుమ్మలించుచుండిరి. ఇంకను గొంద ఱీయుపాధ్యాయసంఘమున గలఁతలు పుట్టించిన మహాత్ములు నలువురు తొలఁగినఁగాని యిది బాగుపడదని నిశ్చయించుచు నట్టిమంచికాల మెపుడువచ్చునా యని దానిరాకకై యువ్విళులూరుచుండిరి.

పూటపూటకు భుజంగరాయఁడు, లక్ష్మీనివాసదాసు లోనగువారి మిట్టిపాటు దుస్సహామయ్యెను. బాలకులు వారి మూలమున దుర్వినీతులై గురువులపైఁ దిరుగఁబడఁబూనిరి.

లోలోన వారబ్బాలకులఁ బురికొల్పుచున్నవారని కింవదంతి యొక్కటి ప్రబలెను. దానిసత్యాసత్యములు దేవుఁడే యెఱుంగ వలయును. బాలకులు దుర్విదగ్ధులగుట మాత్రము సత్యము. దూరదేశమున నున్నపురుషోత్తమరాయఁ డవ్వార్తనాలకించి పరితపించెనుగాని యాపదము తనకు లభింపదని యెఱింగి యూరకుండెను. ప్రధానోపాధ్యాయుఁడు బుద్ధిమంతుఁడు. దూరదృష్టిగలవాఁడు కాని కుమతులగు సహోపాధ్యాయుల దుర్వృత్తిచేఁ దనకౌశలముఁ జూపఁజాలక పరితపించుచు నుండెను. దినమొక్కగండముగాఁ బాఠశాలను జరపుచుండెను. భుజంగరాయాదులమతమునకు నాతనిమతమునకు సంబంధము లేదు. ఎన్నియో యోజనములంతదూరము కలదు. కనుకఁ జక్కఁగా వృత్తిని సాగింప ననువుపడదయ్యెను. ఇరువు రేకమతము గలవారలైన నెంతయో సొంపుగఁ గార్యము సాగుచుండుఁగదా.

మహాసభ్యులవర్తనము నించుక విచారింతము. వివిధమతములవా రందుఁ గలరు. ఒక్కరికి నింకొకరికి సంబంధము లేదు. అట్లున్నఁ గార్య మెట్లు సాగును? పరస్పరద్వేషము ప్రబలెను. ఇద్దఱొకటిగ ముగ్గురొకటిగ నేవురొకటిగ నిట్లు పెక్కురీతుల సంఘములు బయలువెడలెను. వారెల్లరు స్వార్థపరులే కాని పరార్థవ్యాపృతు లొక్కరునుగారు. ఏ కార్యమున ధనముదొరకునో యది ముగియుదాఁక నొక్కటిగనుండి మఱొక్కకార్యమున మఱియొకరితోఁ గలిసియుండి యిట్లు లనేకరీతులఁ బ్రవర్తిల్లి ధనము నార్జింపసాగిరి. మర్యాద యేమూల నున్నదో వార లెఱుంగకపోయిరి. అగౌరవమన నల్లనిదో తెల్లనిదో వారి కెఱుకపడదయ్యెను. పెద్ద లేమనుకొందురో యన్న

భయము వారికి లేకుండెను. భగవంతుఁడు చూడఁజాలఁడన్న విశ్వాసమే వారికింగల్గెను. అందఱ మోసపుచ్చఁజాలుదు మన్న యహంకారమే వారలకు మూలధనముగ నుండెను. అదియే మర్యాదగా వారలకుఁ దోఁచెను. "ధనమూల మిదం జగత్త"ను నదియే యుపనిషద్వాక్యమని భావించి వారు ప్రవర్తింపసాగిరి.

"యథా రాజా తథా ప్రజాః" అన్న న్యాయము ననుసరించి పరిపాలకులమర్యాద ననుసరించి మఱింతకుటిలముగా భుజంగరాయాదులు వర్తింపసాగిరి. ప్రధానుఁ డేదియు నొనరింపఁ వలనుపడమి నూరకయుండెను. బాలురస్వచ్ఛందవృత్తిని దిలకించి యెదుటనున్న పాఠశాలయందలి బాలికలెల్ల సేవగింపసాగిరి. చక్కఁగాఁ బఠించి పరీక్షలయం దుత్తీర్ణతఁ గాంచవలయునన్న యభిలాషము వారలకుం గల్గినందున మఱింతపట్టుదలతో వారు చదువుకొనసాగిరి. ఉపాధ్యాయిపిండు రేయింబగళ్లు శ్రమించి పాఠములు చెప్పుచు వారలం జదివించుచు వంకలుదిద్దుచు మఱియుం బురికొలుపుచుఁ బాఠశాలమర్యాదనినుమడింపఁజేయ నూహాలు పైకొనఁ బాటుపడసాగిరి. వారిం జూచుచుండియు లజ్జలేక యాదుష్టోపాధ్యాయసంఘము యథాపూర్వముగా వర్తింపసాగెను. వారిప్రాపు నూఁతగాఁగొని కొందఱుబాలకులు చెలరేఁగి తిరుగుచుండిరి. ఇదంతయు దుష్కాలమహాత్త్వమని యెల్లరనుకొనుచుండిరి. కొలఁదినెలలిట్లు చెల్లెను. పరీక్షాదినములు సమీపించెను. రెండుపాఠశాలలయందుఁ బరీక్షలు జరగెను. పరీక్షయం దాఱితేఱినబాలికలసంఖ్య నలువదియని ప్రకటింపఁబడియె బాలకులసంఖ్య పదునాలుగని ప్రకటితమయ్యెను. బాలికలాకక్ష్యయందే బదిమందియుండిరి. బాలకులాకక్ష్యయందుఁ దొంబదియే

**దుగు** రుండిరి. దీనింబట్టియే పాఠశాలస్థితి యెట్లున్నదియుఁ దెలియవచ్చును. తొంబదియేఁడుగురు పరీక్షకుంబోయి పదు నలుగురు ఉత్తీర్ణులగుట కడుంగడు సిగ్గొదవించుచున్నదని విద్యావంతులు గ్రహింపకపోరు. దొరతనమువారాసంవత్సర మాబాలికలకు మంచిబహుమాన మొసంగిరి. ఆదిన మొక యుత్సవముసాగెను. పెక్కండ్రక్కడం గ్రిక్కిఱిసి యుండిరి. ప్రతివారును బాఠశాల నద్దానిం బొగడుచు బాలురుండు విద్యాశాలను దెగడుచుండిరి. ఆశబ్దముల నాలకించుచుండియు నాయుపాధ్యాయులపిండు సుంతయు లజ్జనొందదయ్యెను. ప్రధానోపాధ్యాయుఁడు నరసింహమూర్తియు ననంతగిరి శాస్త్రియుఁ గుమారశర్మయు విజయరామస్వామియు మిక్కిలి లజ్జించి యక్కటా! ఈవిద్యాశాల కిట్టియపకీర్తి రాఁజెల్లునే యని కుందుచుండిరి. ఆయుత్సవానంతర మెల్లరువిన నధ్యక్షుఁడీ ద్వీపమునఁ గలపాఠశాలలయం దీబాలికాపాఠశాలయే మర్యాద మిక్కిలిగాం జెననియుఁ గాంచఁగలదనియుఁ బొగడెను.

మఱునాఁడు మొదలుకొని మహాజను లొక్కరొక్కరుగా నుపాధ్యాయులస్వచ్ఛందవర్తనమును దెగడసాగిరి. వారిం గాంచినపుడెల్ల వారికి వినఁబడునట్టులు తిట్టసాగిరి. ఆపలుకులు ములుకులవలెఁ జెవులనాటినను వారు లెక్కింపలేదు. పెద్దలం గాంచిన నిర్లక్ష్యముగా నుండసాగిరి. తుదకాయుపాధ్యాయసంఘము గర్వము దుర్భరమయ్యెను. నిర్వాహకుని జాడ్యముం గాంచి దొరతనమువారు ప్రసంగతిం గల్పించుకొని భుజంగరాయఁడు లోనగునుపాధ్యాయులకు వేతనములఁ దగ్గించియుఁ జీవాట్లు పెట్టియు నపరాధముల వైచియుఁ గష్టములపాలు చేయసాగిరి. లక్ష్మీనివాసదాసు, సుబ్ర

ష్టాత్యరాయఁడు, భుజంగరాయఁడు, ననుమూవురకు నొక్క సంవత్సరము వేతనము లేనిపద్ధతి సెలవీయఁబడియెను. నీలాద్రి రాజస్వామికి వేతనమునందు సగముమాత్రమే త్రోసివేయఁబడియె. క్రొత్తవారు మువ్వురు పాఠశాలం జేరిరి. వారిమూలమున విద్య వృద్ధియగునని కొంద ఱూహించిరి. ధేనుకాచార్యుఁడసమర్థుఁడయ్యు నెవ్వరిమూలముననో యుద్యోగము సంపాదించుకొన్నవాఁడు కనుకఁ దనపని నిర్వహింపఁ జాలకయున్నను మహాసభ్యులలోఁ గొందఱు తనయందుఁ బ్రీతిగలవారలుండుటంజేసి వారియిండ్లఁ బాకము చేయుచు మఱెంత వారిదయను బడసి కాలముం బుచ్చుచుండెను. సర్వభక్షకద్వివేది పాఠశాలయందుఁ గలపుస్తకములను దారుమయవస్తువుల నమ్ముచు ధనము నేకరించుచు నెవ్వరేమన్నను నవ్వుచు మర్యాదతో నేమిలాభమని నీచకార్యముల నొనరించుచు లజ్జమాని తిరుగుచు మర్యాదగలవారలయం దెట్టిలోపములు కలవని కల్పించుచు నైహికాముష్మిక సుఖదూరములగు కార్యములను జేయుచుఁ గాలముంబుచ్చుచుండెను. వాఁడుకల్పించునవి సర్వథా యసత్యవార్తలేయయ్యుఁ గొందఱకవి విశ్వాసపాత్రములగునేమో యన్నభయమునఁ బెద్దమనుష్యు లాతని నేమనలేకుండిరి. ఇట్లు లాటిస్ట్రోపాధ్యాయసంఘము సర్వానర్థమూలమయ్యెను. సాధూపాధ్యాయులు వారియద్భుతదుశ్చర్యలకుఁ దల్లడిల్లుచుండిరి.

సుదర్శనశంకరు లిమువురు పట్టుదలతో మంచిబాలురం గూర్చుకొని వారికెల్లవిధములు తెలియునట్లు బోధించి పెద్దలకడకుంబోయి విద్యాశాలదుస్స్థితిని దెలియఁజెప్పుచుండఁగా గొందఱు పెద్ద లవ్వార్తల నాలకించి వానియాథార్థ్య మెఱింగి

మహాసభ్యులకుం దెల్పి వారివలన లాభము కలుగదని నిశ్చయించి రాజోద్యోగులకడకుంబోయి తెల్పిరి. వారు పట్టుదలఁ బూని విచారించి యింతకుముందే యెఱింగినవారు కావున నయ్యది విశ్వాసపాత్రము కాఁగా నాగ్రహించి యున్నతోద్యోగులయనుమతిఁబొంది విచారింపసాగిరి. దుష్టోపాధ్యాయసంఘచరిత్రము తేటతెల్లమయ్యెను. రెండునెలలలో నలుగురి నాసంఘమునఁ బ్రధానులుగ నుండువారిని దొలఁగించి మంచివారి నాస్థానమున నెలకొల్పి తక్కినవారికింగూడ భయము గలుగఁ బలికి యిఁకముం దిట్టిదుష్టవృత్తిఁబూనిన సాగనంపుదుమని హెచ్చరించి బాలురంగూడఁ గొందఱ ననర్హులను దొలఁగించి యందఱు ప్రధానునియానతిమెయి మెలంగవలయునని శాసించిరి. దానికి విరుద్ధముగ గొందఱు పూనుటెఱింగి కొలఁది సంవత్సరములు వారు పాఠశాలకు రాఁదగరని ప్రకటించిరి. ఆ విద్యార్థులదుస్స్థితి నెఱింగి తక్కినవారు తెలివిగలిగి వినయము జూపుచు వర్తింతుమని యధికారులఁ బ్రార్థించి విద్య నభ్యసింపసాగిరి. దినదినమునకు నుపాధ్యాయులు దౌష్ట్యమును మాని యధికారులమనస్సు గనిపెట్టి వర్తించుచుఁ బ్రధానోపాధ్యాయుని యుత్తరువుమన్నించుచు సోమరితనమువదలి విద్య చెప్పుచు బాలకులవలన నేరూపముననైన ధనముగాని వస్తువులఁగాని గ్రహింపక యెదుటనున్న పాఠశాలయందలి యుపాధ్యాయబృందము నుదాహరణముగాఁ గైకొని వర్తించుచుండిరి. చిత్రకళాశాలయు వృద్ధిఁబొందుచునుండెను.

మహాసభ్యులు నిర్వాహకుఁడుకూడ దొరతనమువారి శాసనమునకు లోఁబడవలసినవారైరి. వారివర్తనము వెల్లడి కాఁగా నందుఁ గొందఱఁ దొలఁగించి రాజోద్యోగులు తక్కిన

వారికి బుద్ధివచ్చునట్లు చేసిరి. నిలిచినవారు క్రొత్తవారింగూడి మర్యాదగలనిర్వాహకు నెన్నుకొని ధనమునార్జించు కుతూహలముమాని హద్దుమీఱివర్తింపక లోకు లేమనుకొనుదురో యనిజంకుచు న్యాయ్యముగా వర్తించుచుఁ బాతాళద్వీపమునకుఁ గలపూర్వవిఖ్యాతి మరలఁ దలయెత్తునట్లు చేయఁబూనియుండిరి. దానిననుసరించి విద్యాశాలలు రెండును బరస్పరవిజిగీషలంబూనక యైకమత్యమున వర్తించుచు వృద్ధికిం దెచ్చు మార్గముల నాలోచించుచు దుర్వృత్తి లేశమైనను లేకయుండఁ దమప్రవర్తనము నలవఱచుకొనుచునుండిరి. నెలకొక్కసారి బాలురకుఁ బరీక్షలం బెట్టి యందుఁ గృతార్థులు కానివారలకు మఱింత శ్రద్ధగాఁ జదువు చెప్పుచు వారిండ్లకు వచ్చి సంశయములఁ దెలిపినయెడల వానిం దీర్చుచు విద్యాశాల తమయిల్లుగా బాలుర తమపిల్లలుగా భావించుచు నుండిరి. కావున నావిద్యాశాల పూటపూటకు మర్యాదగాంచుచుఁ జక్కఁగా వర్ధిల్లసాగెను. అనంతగిరిశాస్త్రి, కుమారశర్మ, నరసింహమూర్తి లోనగువారి యుద్దేశములు మంచివి గాన నవి ఫలించెననియు భుజంగరాయఁడు లోనగువారి ప్రయత్నములు దుష్టములుగాన నవి పాడఁబడంగెననియు నెల్లరు భావించుచుండిరి. మఱియు సంభావించుచుండిరి. ఒక్కనాఁటిసభలో మహాసభ్యులలో నొకరు లేచి మాటలాడుచు నల్పు లెంత ప్రయత్నించినను దూషించినను జనులకు మంచివారనిపించుకొను వారియత్నములు ఫలింపకయుండునా. ఉదాహరణము మీ రెల్లరెఱింగినదియే కదా. ఎందఱు కట్టుగనుండినను, వారిపక్షమున నధికారు లెందఱుండి సాయము చేయఁబూనినను జనులకు మంచివారగువారి ప్రయత్నములు ఫలింపకపోవనునది సత్య

మని మూఁటికి ముమ్మాఁటికి నిరాఘాటముగఁ జెప్పవచ్చును గదా. దుష్టోపాధ్యాయులపౌరుషము లడంగెను. వారిప్రోత్సాహమునఁ దిరుగఁబడినబాలురగర్వ మంతరించెను. పోయిన మర్యాద గలుగ మొదలిడెను. శాంతి చేకూరెను. ఇఁక మీఁదఁ బాఠశాలయందలి బాలురు దేశభక్తి రాజభక్తి దైవభక్తి గురుభక్తి మాతృపితృభక్తి గలిగి మర్యాదయం దాసక్తిగలిగి మెలంగుదురని నమ్మవలయును. పరమేశ్వరుఁడు కరుణచేఁ బాతాళద్వీపమును వృద్ధికిం దెచ్చుఁగాక. విద్యాశాలలఁ బెంపొందించుఁగాక. ఉపాధ్యాయులమదులు క్రూరత్వమును విడనాడియుండఁ జేయుఁగాక. మఱియు సాధువుల ప్రయత్నములు ఫలించుచుండుఁగాక. బాలికలు పూర్వాచారములతత్త్వ మిదియని యెఱింగి వాని నాచరించుచుఁ బేరుపొందుదురుగాక. వారిమూలమున నీద్వీపవిఖ్యాతి యొసంగుచుండుఁగాక. ప్రభుశిరోమణి యీద్వీపమును ముఖ్యముగా భావించి ధనమొసంగి యుత్తమారోగ్యభాగ్యముగలదిగా వర్ధిల్లఁజేయుదురుగాక. ప్రభువతంసములకు దీర్ఘాయురారోగ్యములు కలుగుంగాక. సర్వజనులు సుఖాయురారోగ్యభాగ్యములు గలిగియుండుగాక. అని పెద్దలు కోరుచుండిరి. అంత నామహాసభ ముగి సుఖముగ నాద్వీపముండెను.

స్వస్తి స్వస్తి స్వస్తి

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933.

